# వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయసూచిక

(An Annotated Bibliography of Veturi Prabhakarasastry)



ఉస్మానియా విశ్వవిద్యాలయమువారి
ఎం.ఫిల్. సిద్ధాంతగ్రంథము

మసన చెన్నప్ప
ఎం.ఏ., ఎం.ఫిల్.

ప్రమీలా ప్రచురణలు
12-11-1095 వారాసిగూడా,
సికింద్రాబాద్ 500 361

VETURI PRABHAKARA SASTRY VANGMAYA SUCHIKA
(An Annotated Bibliography of Veturi Prabhakara Sastry)

By MASANA CHENNAPPA, Lecturer in Telugu, Pragathi
Maha Vidyalaya Jr. College, Hanumantekdi, Hyderabad - 1.

ప్రథమ ముద్రణ : డిసెంబరు 1985

వెల రూ. 40

ప్రతులకు :

ప్రమీలా ప్రచురణలు
12-11-1095, వారాసిగుడా
సికింద్రాబాదు—500 361

నవయుగ బుక్ హౌస్
సుల్తాన్‌బజార్, హైదరాబాదు

దేశి బుక్ హౌస్
నారాయణగూడ, హైదరాబాదు

ముద్రణ :

మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్
1-1-694/2/ఎ, గాంధీనగర్
హైదరాబాదు 500 380

[ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సాంస్కృతికశాఖ ఆర్థిక సహాయముతో ప్రచురితము]

# విషయ సూచిక

## నాగురించి

| | |
|---|---|
| పుట్టింది | 1955 ఫిబ్రవరి 8న |
| చదువు | ఉస్మానియా విశ్వవిద్యాలయంనుండి ఎం.ఏ. (తెలుగు) గోల్డ్ మెడలిస్ట్; ఎం.ఫిల్. ప్రస్తుతం "ప్రాచీన కావ్యాలలో (1000-1600) గ్రామీణ జీవన చిత్రణం"పై పిహెచ్, డి. పరిశోధన. |
| అనుభవం | 1975—81 మధ్యకాలంలో ఇస్లామియా బాయ్స్ హైస్కూల్‌లో తెలుగు పండితుడుగా—1981 నుండి ప్రగతి మహావిద్యాలయంలో తెలుగు ఉపన్యాసకుడుగా— |
| రచనలు | మల్లిపదాలు (1980) |

# నా మాట

ఆంధ్ర వాఙ్మయ ప్రపంచమున శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రికి విశిష్టమైన స్థానమున్నది. వారెంతటి కవులో అంతటి పరిశోధకులు. ఎంతటి సరసులో అంతటి గంభీరులు. ఎంతటి సాహిత్యప్రియులో అంతటి యోగసాధన ప్రియులు. శాస్త్రిగారు కలము పట్టిన కలకాలము నిలువగలిగిన రచనలు వెలువడెడివి. గొంతు విప్పినచో క్రొత్త సంగతులు తెలిసెడివి. వారు కవితా హృదయముగల పరిశోధకులు.

ఒక విషయమును చెప్పదలచినప్పుడు దానికి సంబంధించిన గ్రంథ జాలమంతటిని నిశితముగా పరిశీలించుటయేకాక లోక వ్యవహారమును కూడ దృష్టియందుంచుకొనుట శాస్త్రిగారి యుపజ్ఞ. శైలిని బట్టి కర్తృత్వమును నిర్ణయించు పద్ధతిని వారానాడే అవలంబించిరి. 1914లో రచించిన 'కామధేనువుకథ' 1919లో గిడుగువారికి వ్రాసిన 'వాడుకభాష—లేఖ' వారికి వ్యావహారిక భాషలో గ్రంథ రచనము చేయుటయనిన ఎంత ఇష్టమో తెలుపుచున్నవి.

ప్రభాకరుల పద్యకృతులు యథార్థకథా రామణీయకములై, ఉపదేశాత్మకములై, పూర్వ కవుల కృతులకు తీసిపోనివై అలరారుచున్నవి. వారి అనువాదములు తీయములై స్వతంత్ర రచనలవలె ఒప్పుచున్నవి. వారి వ్యాస ప్రపంచ దర్పణమున ప్రతిఫలించని విషయము లేదనవచ్చును. వారి వ్యాసములు చదువునపుడు కావ్యమును చదువుచుంటిమన్న స్ఫూర్తి కలుగును. వారి గ్రంథ పీఠికలు అమూల్య రత్నపేటికలు. వారి ప్రసంగములు గంగాతరంగములు. వారి స్వీయ చరిత్రము (ప్రజ్ఞాప్రభాకరము) స్వీయచరిత్ర రచనకు వరవడి పెట్టుటయే కాక జీవిత పరమార్థమునకు వ్యాఖ్యానప్రాయమైన రచనము.

సాహిత్యము అన్ని తరగతుల వారనుభవింపదగినదిగా ఉండవలెనన్నదే ప్రభాకరుల ఆశయము. సారస్వతము పరమార్థాభిముఖముగా సాగవలెనన్నదే వారి లక్ష్యము. వారి దృష్టిలో సజీవరచన సత్పురుషుని శీలము వంటిది.

ప్రభాకరులు తాడిచెట్టు గురించి వ్రాసినను, తాళపత్ర గ్రంథమును గురించి వ్రాసినను, తాళ్లపాక అన్నమయ్యను గురించి వ్రాసినను అన్నింటిలోను వారి మౌలిక పరిశోధన పాటవమే సువ్యక్తమగును.

చాటు పద్య మణిమంజరి వంటి ఉత్తమ సంకలన గ్రంథమును ప్రచురించిన శాస్త్రిగారు గాంధీ రామాయణమును సంకలన గ్రంథముగా తీర్చి దిద్దవలెనను కొనిరి. కాని కోరికగానే మిగిలిపోయినది. మరుగునపడిన తాళ్లపాక వారి కృతులను వెలుగులోనికి తెచ్చిన ఘనత వారిదే.

ప్రభాకరులెంతటి సాహితీ వేత్తయో అంతటి మానవతామూర్తి. యోగ సాధన ప్రభావమున ఎందరి బాధలనో వారు పోగొట్టినారు. పత్రికలకు వ్యాసములు వ్రాయుడవి సంపాదకులు కోరినట్లే, తమ బాధలు పోగొట్టుడని ఎందరెందరో వారికి టెలిగ్రాములు వ్రాసిన సంఘటనలున్నవి.

కొమర్రాజు, మానవల్లి, మల్లంపల్లి, రాళ్లపల్లి వంటి ప్రముఖ పరిశోధకులు శాస్త్రిగారి కత్యంత సన్నిహితులు. *కళాప్రపూర్ణ దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారి స్వీయచరిత్రను చదివినచో ప్రభాకరుల వ్యక్తిత్వ మెంత విశిష్టమైనదో తెలియగలము.

ఊహాముఖమైన ప్రజ్ఞ, సునిశితమైన విమర్శన పాటవము వారి పరిశోధనకు వన్నెలు దిద్దినవి. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారన్నట్లు వారు "మూర్తీభవించిన పరిశోధన". శర్మగారన్న ఆ మాట 'కళాప్రపూర్ణా'ది బిరుదములకంటెను విలువైనదని నా అభిప్రాయము.

ఒక ప్రణాళికననుసరించి నేనీ వాఙ్మయ సూచికను రూపొందించినాను. కేవలము కేటలాగువలెకాక వివరణాత్మక వాఙ్మయసూచికగా తయారుచేసినాను. శాస్త్రిగారి రచన లన్నింటిని లభ్యమైనంతవరకు చదివి ముఖ్యాంశములను

---

* 1976, రచయితల సహకారసంఘ ప్రచురణము, గుంటూరు. 197–205, 244–247.

'వివరణ' (*Annotations*) అను విభాగములో ఇచ్చినాను. పాఠకులకు, పరిశో ధకులకు ఇందువలన ఎంతో ఉపయోగము కలుగును. ఈ గ్రంథ రచనమున కనంతర కాలమున వెలువడిన 'మణిమంజరి' వ్యాసములను పరిశిష్టములో గ్రహించినాను.

శాస్త్రిగారి ముద్రితాముద్రిత రచనలు ప్రభాకర పరిశోధక మండలివారి కడ నున్నవి. వారు ''మణిమంజరి'' అను షాణ్మాసిక పత్రికను ఫిబ్రవరి 1981 నుండి వెలువరించుచున్నారు.

ప్రభాకరశాస్త్రి పరిశోధన వాఙ్మయ దీపికలుగా 'మణిమంజరి' సంపుటములు ఉత్తమ సాహిత్యాభిరుచిగల పాఠకుల మన్ననలు పొందినవి. పరిశోధన విషయమున నాకు 'మణిమంజరి' ఎంతో సమాచారము అందించినది. తమ దగ్గరున్న శాస్త్రిగారి రచనలను నాకందించి తోడ్పడిన 'ప్రభాకర పరిశోధక మండలి'వారికి నేనెంతో ఋణపడిఉన్నాను. వారికి మొట్టమొదట నా కృతజ్ఞతలు చెప్పుకొనవలసియున్నది.

ఉస్మానియా విశ్వవిద్యాలయము-తెలుగు శాఖలో ఇదే మొదటి వర్ణనాత్మక వాఙ్మయ సూచిక. ఈ వరుసలో ఇంకెన్నో వాఙ్మయ సూచికలు రావలసి యున్నవి.

ఈ పరిశోధన గ్రంథము ఈ విధముగా రూపొందిన దన ఇదంతయు మద్గురువర్యులు, అమృతహృదయులు ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారి చలువే. వారు పర్యవేక్షులుగా ఉండి తమ పితృదేవుల రచనల నొసంగి నాకెంతో సహకరించినారు.

కలసియున్న ముచ్చటలలో ఎన్నో విశేషాలు తెలియజేసిన వారు ప్రభాకరుల అంతేవాసి సహృదయులు డా॥ పోచిరాజు శేషగిరిరావుగారు.

ప్రభాకరశాస్త్రి వాఙ్మయ సూచికను పరిశోధనాంశముగా గ్రహించమని సూచించినవారు నా గురువర్యులు డా॥ ఆర్. శ్రీహరిగారు. ఆమోదము తెలిపిన వారు ఆచార్య సి. నారాయణరెడ్డిగారు, ఆచార్య కె. గోపాలకృష్ణారావుగారు, ఆచార్య బి. రామరాజుగారు.

ఎడనెడ అమూల్యమైన సలహాలొసంగినవారు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు, డా॥ ఎన్. గోపిగారు.

గ్రంథ ప్రచురణవేళ దయతో తమ ఆమోదం, అభినందన, ఆశీస్సులు అందించిన ఆచార్యవర్గమునకు, సహృదయులకు అందరికి నా కృతజ్ఞత లందజేయుచున్నాను.

కార్డులు సిద్ధము చేయుటలో సహకరించిన నా అర్ధాంగి ప్రమీలకు, నా మిత్రులు ఎ. పాండయ్యగారికి కృతజ్ఞతలు.

అందముగా అచ్చువేసిన మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్‌వారికి కృతజ్ఞతలు.

19–11–'85

మసన చెన్నప్ప

డా॥ కె. గోపాలకృష్ణారావు
ప్రొఫెసర్—తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయము

# ఆమోదం

ఉస్మానియాలో పరిశోధన విభాగం కొంచెం ఆలస్యంగా పని ప్రారంభించినా దాదాపు ముప్పదేండ్ల కాలంలో ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని విశ్వవిద్యాలయాలకంటె ఎం. ఫిల్, పిహెచ్. డి. పరిశోధక విద్యార్థులను ప్రోత్సహించడంలో ముందంజవేసిందని భావించవచ్చు. వివిధ పరిశోధనాంశములు గ్రహించి సిద్ధాంత వ్యాసములు వెలువరించుటలోను ఉస్మానియా తెలుగుశాఖ వైశిష్ట్యాన్ని సంతరించుకొన్నది. కేవలం వాఙ్మయ శాఖలోని ఒకే ఒక అంశానికి పరిమితం కాకుండా భాష, భాషాశాస్త్రం, వ్యాకరణం, చరిత్ర, వాఙ్మయ ప్రక్రియా వికాసం, కావ్య ప్రబంధాది ప్రక్రియల వికాసం, ప్రసిద్ధ కవులు-వారి కావ్యాల పరిశీలనం, అముద్రిత గ్రంథ పరిష్కృత ప్రచురణం, కవి వంశముల వాఙ్మయ సేవ ఇత్యాది అంశములను పరిశోధక విద్యార్థులు గ్రహించి ప్రశస్తములైన సిద్ధాంత వ్యాసాలు సమర్పించినారు. అది వారికి పట్టాన్ని ప్రసాదించినా తెలుగుశాఖకు అందులోను పరిశోధకరంగానికి ఎంతో విలువైన సామగ్రిని అందించింది. ఇటువంటి కృషిలో వాఙ్మయ సూచికలపై పరిశోధన ప్రత్యేకంగా గణింపదగింది. యు. జి. సి మరియు ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆర్థిక సహాయంచే శ్రీశ్రీ జీవితము – రచనల వాఙ్మయ సూచికను సిద్ధంచేసే ఒక ప్రణాళిక రూపొంది, దానికి సంబంధించిన పరిశోధనము నా ఆధ్వర్యంలో సాగుచున్నది.

ఇటీవల కాకతీయ విశ్వవిద్యాలయంవారు విశ్వనాథ వాఙ్మయసూచికలను ప్రచురించి ఈ రంగంలో మార్గదర్శకులైనారు. అది తెలుగుశాఖ పక్షాన జరిగిన కృషి. ఆ పరంపరలో ఉస్మానియాలో మొదటిసారిగా కృషిచేసే అవకాశం మా విద్యార్థి శ్రీ చెన్నప్పకు లభించింది. సాయంకళాశాల నుండి ఎం.ఏ. ప్రప్రథమ

శ్రేణిలో పైసై ఎం.ఫిల్ పరిశోధనకై వేటూరివారి రచనల వాఙ్మయ సూచికను గూర్చి సిద్ధాంత వ్యాసం వ్రాసి పట్టానొందినారు. పరిశోధన దృక్పథాలు నానా విధాలుగా ఉంటవి. వానిలో ప్రసిద్ధ కవుల జీవితాన్ని వారి రచనలనుగూర్చి సూచికలు సిద్ధం చేయడం ఒకటి. ఇవి సాహిత్య పరిశోధకులకు అమూల్యమైన సామగ్రిని అందిస్తాయి. మనకు కవుల జీవితాన్నిగూర్చి, వారి రచనల ముద్రణ ఇత్యాది అంశములగూర్చి ఎన్నో వివరాలు తెలియకుండా పోయినవి. సమకాలికుల రచనలనుగూర్చికూడ ఏ కొందరికో తప్ప అన్ని విశేషాలు సాహిత్యాభిమానులకు తెలియవు. అవి అన్నీ చరిత్రలో విస్మృతాలు కాకుండా వాఙ్మయ సూచికలు తోడ్పడుతుంటాయి. పాశ్చాత్య దేశాల్లో భిన్న భిన్న సాహిత్యాల్లో ఈ పరిశోధన విభాగం ఎంతో గణనీయమైన కృషి చేసింది. మన దేశంలో ఇది ఇంకా పురిటి దశలోనే ఉన్నది. ఇటువంటి వాఙ్మయ సూచికలు దాదాపు అందరినిగూర్చి వచ్చినప్పుడే దీనికి సమగ్ర స్వరూపం వస్తుంది. ఈ రంగంలో విశేషమైన కృషిచేసిన శ్రీ చెన్నప్పను అభినందించక తప్పదు.

శ్రీ చెన్నప్ప ఎం ఫిల్ సిద్ధాంత వ్యాసం వెలుగులోకిరావటం నాకెంతో ఆనందాన్ని కలిగిస్తున్నది. ఇది ఇతర పరిశోధక విద్యార్థులకు మార్గదర్శకం కాగలదని నా ప్రగాఢ విశ్వాసం. పరిశోధనలో కేవలం డిగ్రీ తీసికొని తృప్తిపడకుండా సిద్ధాంత వ్యాసాన్ని ప్రచురించడంలో కూడ శ్రద్ధవహించిన చెన్నప్పను మళ్లీ ఒకసారి మనసారా అభినందిస్తున్నాను.

17–11–'85 కె. గోపాలకృష్ణారావు

డా॥ వేటూరి ఆనందమూర్తి
ప్రొఫెసర్—తెలుగుశాఖ
పి. జి. కాలేజ్, ఉస్మానియా విశ్వవిద్యాలయము

# అభినందన

చిరంజీవి మసన చెన్నప్పగారిని శ్రద్ధాసక్తులుగల సాహిత్య విద్యార్థిగా ఆయన ఎం.ఏ చదువుతున్న రోజులనుండీ ఎరుగుదును. తదుపరి పరిశోధన కుపక్రమించి ప్రభాకర వాఙ్మయపరిశీలన కుద్యమించి, ఉస్మానియా విశ్వ విద్యాలయంవారి ఎం.ఫిల్ పట్టానికై 'వేటూరి ప్రభాకరశాస్త్రి వాఙ్మయ సూచిక'ను విషయంగా ఎన్నుకొని పరిశోధన విద్యార్థిగా (1981—82 సం॥లలో) నాదగ్గర చేరి పరిశ్రమించినపుడు చిత్తశుద్ధితోను దక్షతతోను ఆతడు కావించిన కృషిని మరింత సన్నిహితంగా పరీక్షించే అవకాశం కలిగి అధ్యయనంలోను అన్వేషణ లోను ఆతనికిగల జిజ్ఞాసను పరితోషంతో భావించగలిగినాను. ప్రస్తుతం హైదరా బాదులో అధ్యాపకవృత్తిని సమర్థంగా నిర్వహిస్తూనే ఆతడు డాక్టరేట్ పట్టానికై కృషిని కొనసాగిస్తున్నాడు.

అధ్యయనం, అధ్యాపనం, అందుకీడైన అన్వేషణ దృక్పథం వ్యక్తిత్వ వికాసానికి హేతువులు. అభ్యుదయ హేతువులైన ఈ మూడు వృత్తులూ సమంగా సమకూడిన ఈ జిజ్ఞాసువు వర్ధిష్ణువు. ఈ చిరంజీవికి జీవితరంగంలో అన్నివిధాలా అభ్యుదయ పరంపరలు కలుగవలెనని ఆకాంక్షిస్తున్నాను.

పరిశోధనరంగంలో సమగ్రములైన వివరణాత్మక వాఙ్మయ సూచికలు గొప్ప ఆకరాలు. కనుక వాటి నిర్మాణం పరిశోధన కృషిలో మొదటి మెట్టు. ఇట్టి ఆకరాలు సంపూర్ణంగా సంధానింపబడినప్పుడే పరిశోధనలో పరిశోధక విద్యార్థికి అనువు కలగడంతోపాటు ఆ రంగాన దారీతెన్నూ తెలుసుకొనే అవ కాశం కూడా కలుగుతుంది. ఆంధ్ర వాఙ్మయ ప్రక్రియలకు, ఆంధ్ర వాఙ్మయ

నిర్మాతలకు సంబంధించినంతవరకు ఆకరములుకాదగిన వివరణాత్మక వాఙ్మయ సూచికలు అంతగా వెలువడలేదనే అనవలె. పర్యవసానంగా ఏ రంగంలోనైనా ప్రతి పరిశోధక విద్యార్థి ఆకరాలకోసం తడుముకోవడమో, వాటిని సేకరించే యత్నంలో కాలహరణం చేయడమో అందుబాటులోనున్నవాటిని మాత్రమే పరిశీలించి అరకొరగా పరిశోధన సాగించడమో జరుగుతున్నది. అంతకన్న వలసిన విషయాలకు లభ్యమైనంతవరకు వివరణాత్మక వాఙ్మయ సూచికలను సంధానించుకొని వాటిని ఎప్పటికప్పుడు కొత్తగా లభించే ఆకరాలతో సంపన్నం చేసుకొంటూ వస్తే పరిశోధనలో విలువగల కాలమూ కృషీ కలిసివచ్చే అవకాశ ముంటుంది.

ఈదృష్టితోనే పూర్వం ఆంధ్ర వాఙ్మయ నిర్మాతలలో ప్రముఖులైన విశ్వనాథవారి, రాయప్రోలువారి వాఙ్మయ సూచికల నిర్మాణానికి కొంతయత్నం సాగింది. ఆ మార్గాన సాగిందే ఈ వేటూరివారి వాఙ్మయ సూచిక కూడా. అయితే ఇది వెనుకటివాటికన్నా చాలావరకు సమగ్రంగానూ వివరణ సహితంగానూ ఉన్నదని చెప్పవచ్చు. ఈ విషయంలో చెన్నప్పగారికి మునుపు శ్రీ ప్రభాకర పరిశోధక మండలివారు సేకరించి ఉంచిన సామగ్రి చాలా తోడు పడింది. ఆ సామగ్రినీ ఇతరములనూ పరిశీలించి విశ్లేషించి సంగ్రహ వివరణ మును జతకూర్చి చెన్నప్పగారు సంధానించిన ఈ వాఙ్మయ సూచిక భావిపరిశోధకులకు అక్కరకురాగలదనడంలో సందేహం లేదు.

ఈ గ్రంథ మిప్పుడు అచ్చుకావడం చాలా సంతోషకరమైన విషయము. ఈ సందర్భాన నన్ను నాలుగు మాటలు రాయమన్నందుకు సంతోషిస్తూ రచయితను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

హైదరాబాదు
18–11–85

వే. ఆనందమూర్తి

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి
రీడర్—తెలుగుశాఖ
పి.జి. కాలేజ్, ఉస్మానియా విశ్వవిద్యాలయము

# ఆశీస్సు

పరిశోధనా వ్యాసంగానికి తోడ్పడే సాధన సామగ్రి ఇటీవల అందుబాటులోకి వస్తూంది.

భాషపట్ల, సాహిత్యంపట్ల, చరిత్రపట్ల ఆదరాభిమానాలున్న విద్వాంసులెందరో నిన్నటితరంలో ఎన్నో వ్యయప్రయాసలకోర్చి తమ పరిశోధనలు కొనసాగించి వాఙ్మయానికి, సంస్కృతికి ఎనలేని మేలు చేసినారు. మన తూష్ణీభావం వల్ల ఎంతో అమూల్యమైన ఎంతో ఆవశ్యకమైన గ్రంథాలు, సమాచారం దక్కకుండా పోయినవి. ఇది నిన్నటిమాట. ఈనాటికాలంలోకూడ ఆయా రచయితల గ్రంథాలు లభ్యం కావు. ఇరవై ఏండ్ల క్రింద అచ్చైన పుస్తకంకూడ దొరకడం గగనకుసుమమైంది. కనీసం ఆయా రచయితలు చేసిన కృషి రూపురేఖలను గూర్చి రాశి పోసిన వాఙ్మయ సంపదను గూర్చి నిర్దుష్టమైన పరిజ్ఞానం కూడ కలగకుండాపోతున్నది.

విశ్వవిద్యాలయాలలో ఇటీవల వాఙ్మయ సూచికల సేకరణకు సంబంధించిన విషయాలపై పరిశోధనలు ప్రారంభం కావడం ఎంతో సంతోషించదగిన విషయం. ఈ వాఙ్మయ సూచికలు పాఠకులకు, పరిశోధకులకు, ప్రచురణకర్తలకు ఎంతో ఉపయోగపడతాయనడంలో సందేహం ఉండదు.

ప్రజ్ఞామూర్తులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వాఙ్మయ తపస్వి. యోగివతంసులు. సత్యగవేషణా దృక్పథంగల పరిశోధకులు. విద్వత్కవులు. అరు

దైన వచన రచనకు వరవడి పెట్టిన చరితార్థులు. శాస్త్రిగారి వ్యాసాలు, పీఠికలు, కవితలు, లేఖలు సాహిత్య పరిశోధకులకు, భాషాభిమానులకు వెలుగుబాటలు.

చిరంజీవి మనన చెన్నప్ప వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వాఙ్మయాన్నంత టిని వెదికి క్రమపద్ధతిలో ఒక సూచికగా మలచి పరిశోధనాంశంగా రూపొందించి తెలుగు భాషాభిమానులకు అందించడం అభినందనీయం.

చక్కని పఠనాసక్తి, మంచి అవగాహన సామర్థ్యం, సముచిత వచో వైఖరిని అలవరచుకొన్న విద్యార్థిగా చెన్నప్ప నాకు పరిచయం. పద్యాన్ని, గద్యాన్ని నిర్దుష్టంగా రచించగల మెలకువలను సంపాదించుకొన్న విద్యార్థి. ప్రస్తుతం అధ్యాపకుడుగా తన విద్యుక్తధర్మాన్ని నిర్వహిస్తూనే ఈ పరిశోధనకు పూనుకోవడం అతని సాహిత్య ప్రయత్నాన్ని తెలుపగలుగుచున్నది. నా దగ్గర చదువుకొన్న విద్యార్థి ఈ పరిశోధన చేపట్టినందుకు నాకెంతో సంతోషంగా ఉన్నది. మున్ముందు చెన్నప్ప ప్రతిభ మరింత వికసించే అవకాశాలను, పరాత్పరుడు ప్రసాదించాలని హర్షోత్ఫుల్ల హృదయంతో ఆశీర్వదిస్తున్నాను.

పఠితృలోకం ఈ పుస్తకాన్ని సమాదరిస్తుందని ఆశిస్తున్నాను.

18-11-85 ఇరివెంటి కృష్ణమూర్తి

# 1

# వాఙ్మయ సూచికలు - వాని ఆవశ్యకత

పాఠకులకు పరిశోధకులకు వాఙ్మయముతో పరిచయమును కల్గించునవి వాఙ్మయ సూచికలు. ఈ అధునాతన యుగములో ముద్రణ సౌకర్యములు అధికముగా ఉన్నప్పటికిని పాఠకుడు అన్ని పుస్తకములను కొని చదువదగిన స్థితిలో లేడు. అంతేకాక ఒక విషయమునకు సంబంధించిన అనేకులు రచించిన గ్రంథములను సంపాదించుకొనుటయు దుష్కరమే. కావున అన్ని పుస్తకములను కొని చదువలేని లోటును ఈ వాఙ్మయ సూచికలు కొంతవరకు తీర్చుచున్నవి.

ప్రతి పాఠకుడు ప్రతి విషయమును నేర్చుకొనుట అశక్యము. వాఙ్మయ సూచిక అనగా కేవలము గ్రంథముల పట్టిక (Catalogue) కాదు. ఆయా గ్రంథముల బాహ్య వివరణములతో పాటు వాని ఆంతర విషయమునకు సంబంధించిన జ్ఞానమును కూడ కల్గించునట్టిది. వాఙ్మయ సూచిక (Bibliography) ను శాస్త్రముగా నిర్వచించినవాడు Hume అనెడి ఆంగ్లేయ పండితుడు— "The Science of the organization of recorded knowledge". తాళము వేయబడిన విజ్ఞాన భవనములకు తాళపు చెవుల వంటివి వాఙ్మయ సూచికలు. "It is perhaps a key with which we can unlock the treasure-house of knowledge"-1 వాఙ్మయ సూచికల యందు విశేష విషయములు కడు మెలకువతో సంగ్రహింపబడును ఈ కారణముచే మూలగ్రంథమును చదువవలెనన్న ఉత్కంఠ జనించును.

వాఙ్మయ సూచికా కర్త కేవలము చరిత్రజ్ఞుడుగనేకాక కళాకారుడుగను, స్నేహితుడుగను ఉండవలసిన అవసరమున్నది. వాఙ్మయ సూచికలు సర్వ సమగ్రములు కాకపోవచ్చును కాని భవిష్యత్సూచికలకు అవి మార్గదర్శకములై

ఉండగలవు. ఒకవిధముగా ప్రాక్తన గ్రంథములకు సంబంధించిన సమాచార మును అందించుటలో వీనికి ఎంతేని ప్రాధాన్యము ఉన్నది. పూర్వము ఇట్టివి లేకుండుటచే పరిశోధకులకు, పాఠకులకు ఎన్నియో కష్టములు కలిగెడివి. నేడు వాఙ్మయ సూచికల ఆవశ్యకత పెరిగినది. అటు పరిశోధకులు, ఇటు పాఠకులు వానిని విరివిగా ఉపయోగించుకొనుచున్నారు.

ఒక అంశము, లేదా ఒక కాలము, లేదా ఒక రచయిత, లేదా ఒక ఉద్యమము – వీనికి సంబంధించిన గ్రంథములను గ్రహించి వాఙ్మయ సూచికా నిర్మాణము గావించినచో పాఠకులకు వాఙ్మయ పఠన సౌలభ్యము ఏర్పడుననుటలో సందేహము లేదు. ఈ వాఙ్మయ సూచికా నిర్మాణ పద్ధతి ఆంగ్లము నుండి వచ్చినదే. తెలుగులో దీనికింకను ప్రాచుర్యము లభించవలసి ఉన్నది. పెరుగుచున్న పాఠకుల సంఖ్యను, రచయితల సంఖ్యను, పుస్తకముల ధరలను, వాఙ్మయమును దృష్టియందుంచుకొన్నచో వాఙ్మయ సూచికల ప్రయోజన మెట్టిదో స్పష్టమగును.

పరిశోధకుడు ఒక క్రమములో సర్వసమగ్రముగా తన పరిశోధనను కొనసాగించుటకు ఈ సూచికలు తోడ్పడగలవు. వాఙ్మయ సూచికల ప్రత్యేకత ఏమనగా అవి మంచి చెడు అనక అన్ని పుస్తకములను గ్రహించును. చెడు పుస్తకములను సూచించుచు వానిని పాఠకుల దృష్టి నుంచి మళ్లించుటకును వీలగుచున్నది. మంచి చెడ్డలనకుండ సమస్త వాఙ్మయ ప్రపంచమును తమలో ప్రతిబింబించునట్టివి ఈ వాఙ్మయ సూచికలు.

ఈ పేరు గల పుస్తకము ఉన్నదా ? అని పాఠకుడు అడిగినచో చూచి పెట్టుటకే కేటలాగులు ఉపకరించును. కాని వాఙ్మయ సూచిక ఒక విషయము నకు సంబంధించిన అనేక గ్రంథములతో పాటు వానికి సంబంధించిన జ్ఞానమును కూడ అందించును.

---

1. Bibliography in Theory & Practice, Chakraborthy, M.L. Pub 1975, Page: 21.

# 2

# జీవన రేఖ

స్వీయచరిత్ర 'ప్రజ్ఞాప్రభాకరము' మరియు స్వీయరచనల ఆధారముగా శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి జీవితములోని సన్నివేశములు రేఖామాత్రముగ ఇందు సూచింపబడినవి.

1. క్రీ॥శ॥ 1888 ఫిబ్రవరి 7: శ్రీ ప్రభాకరశాస్త్రిగారి జననము. జననీ జనకులు: శేషమ్మ, సుందరశాస్త్రి గారలు. జన్మస్థలము: పెదకళ్లేపల్లి గ్రామము, కృష్ణామండలము.

2. 1893: అక్షరాభ్యాసము; స్వగ్రామమున మద్దూరి రామావధాన్ల దగ్గర సంస్కృతము, ఇంట తెలుగు నేర్చుకొనుట, గణితమున్న ఆసక్తి తక్కువ. తెలుగన్నచో వెఱ్ఱితీపు.

3. 1897: ఇంటి సమీపమున భావన ఋషి ఉత్సవము చూడబోవుట. నాటి నుండి జాతరలకు, దేవోత్సవములకు వెళ్ళుటకు ఇష్టపడకుండుట.

4. 1898: స్వగ్రామమున కలరా వ్యాపింపగా అందొసగ బడిన జంతు బలులు రోత కలిగించుట. పుట్టుక, మరణము, మరణాంతర స్థితులను గూర్చి నిరంతర చింతన.

5. 1900: ఉపనయనము. పురోహిత వృత్తియందు వైముఖ్యము సంధ్యా భాష్యమును అర్థము చేసికొనుట. లఘుకౌముది, కావ్యనాటకాలంకార సాహిత్య గ్రంథములను శ్రీ అద్దేపల్లి సోమనాథశాస్త్రిగారి ద్వార నేర్చుకొనుట. పతంజలి యోగ సూత్రములోని విషయములను ఎరుగుట.

6. 1902: ఎడ్వర్డు పట్టాభిషేకము జరిగినప్పుడు శ్లోకములు రచించుట

7. **1904:** బందరు రాక. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారికి శిష్యులగుట. అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి, పిసిపాటి వెంకటరమణ శాస్త్రి గారలకు సహాధ్యాయి అగుట, అవధానములు చేయుట.

8. **1905:** ఇంటిలో కాకిపగకు గురియగుట. తదాదిగా ఇంటికి తక్కువగా పోవుట.

9. **1906:** మదరాసు రాక: పల్లూరి సూర్యనారాయణరావుగారి ప్రేరణ లభించుట. కెలెట్ హైస్కూలులో పండితులుగా చేరుట. విశ్రాంతిసమయములో మదరాసు ఓరియంటల్ లైబ్రరీలో గ్రంథములు చదువుట.

10. **1907:** ప్రసిద్ధ న్యాయవాది శ్రీ పనప్పాకం అనంతాచార్యుల వాత్సల్యము పొందుట. వారు తెనిగించిన షేక్స్పియర్ 'ఒథెల్లో' నాటకమునకు పద్యములు కూర్చుట.

11. **1908:** దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారితో పరిచయము

12. **1909:** శ్రీ వేపారామేశంగారితో విద్యా వినోదము.

13. **1910:** పిసిపాటి జగన్నాథం గారి కుమార్తె మహాలక్ష్మిగారితో వివాహము.

14. **1910:** వేపారామేశంగారి బైనాక్యులర్ సహాయంతో దక్షిణ భారత దేశమున తొలిసారిగా ధూమకేతువును గుర్తించుట. ఆగస్టు 22వ మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున లేఖకోద్యోగములో చేరుట. లోకల్ రికార్డులను చదువుచు అపూర్వాంశములను గుర్తించుట.

15. **1911:** బండినుండి క్రిందపడుట: గండము తప్పుట.

16. **1911:** పావులూరిమల్లన కాలనిర్ణయముపై కందుకూరివీరేశలింగంగారితో రగడ—వేపారామేశంగారు శాస్త్రిగారి వాదమును సత్యమైనదిగా ప్రకటించుట. కొమ్మర్రాజుల లక్ష్మణరావుగారు కందుకూరిని శాస్త్రిగారికి పరిచయము చేయుట. శాస్త్రిగారి తోడ్పాటుతో కవుల చరిత్ర ప్రథమ భాగమును సంస్కరించుకొనవలెనని సూచించుట. కందుకూరి వారు శాస్త్రిగారికి కొసకి జాబులు వ్రాయుట.

17. 1912: గిడుగు రామమూర్తి పంతులు, గురజాడ అప్పారావుగారలతో సన్నిహితత్వము. వ్యావహారిక భాషావాద సమర్థనము. తంజావూరుకు మొదటిసారి వెళ్ళుట. వ్యావహారిక భాషలో కామధేనువు కథను రచించుట.

18. 19'4: తీవ్రవ్యాధికి గురియగుట, తరుచుగ ఉద్యోగమునకు సెలవు పెట్టుట

19. 1914 తంజావూరి ఆంధ్రరాజుల చరిత్రను సంపాదించి పరిష్కరించుట పీఠిక రచించుట. చాటుపద్య మణిమంజరి ప్రథమ భాగమును ప్రచురించుట.

20 1915: తంజావూరులో ఒక సంవత్సరము సరస్వతీ గ్రంథాలయమున పుస్తకములకు వివరణలు వ్రాయుటకై నియమింపబడుట.

21. 19ı6: మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో పండిత పదవి. ప్రాచీన తాళపత్ర గ్రంథ సేకరణకై ఆంధ్రదేశ పర్యటనము.

22. 1916: అనారోగ్య కారణమున ఉద్యోగమునకు రాజినామా ఇవ్వదలచుట. ఆత్మహత్యా సంకల్పము. అనుకోకుండ 'భృక్తరహిత తారకరాజ యోగము'న చేరుట. ఔషధ సన్న్యాసము. కుంభకోణములో మాస్టరు సి.వి.వి.గారి దివ్యదర్శనము. యోగసాధనము

23 1917: నెల్లూరు మండల యాత్ర

24. 1918: ప్రబంధరత్నావళి ప్రచురణము

25. 1919: గుంటూరు, విశాఖ మండలముల యాత్ర

26. 1922: రాజమహేంద్రవరమునకు వచ్చుట

27. 1922: చాటుపద్య మణిమంజరి ద్వి.భా. ప్రచురణము.

28. 1923: 'శృంగార శ్రీనాథము' ప్రకటనము.

29. 1923–24: 'సరస్వతి' సంచికలలో తెలుగుదేశపు సంస్కృత కవులను గూర్చి వ్రాయుట.

30. 1924: 'భారతి' పత్రిక సంస్థాపనకు ప్రోత్సాహము.

31. 1926: 'నీతినిధి'ని ఆంగ్లమునుండి అనువదించుట.

32. 1927 : బసవపురాణము—పరిష్కరణము, పీఠికా రచనము.

33. 1928 : క్రీడాభిరామ పరిష్కరణము, పీఠికా రచనము, 'ఆంధ్ర లిపి-సంస్కారము' వ్యాస రచనము.

34. 1928—29 : పుదుచ్చేరి గవర్నరు 'డూబ్రేలు'తో సమావేశము.

35. 1929 : బందరు వచ్చుట.

36. 1930 : 'ఆనందవాహిని' మాసపత్రికకు పరోక్ష సంపాదకత్వము.

37. 1937 : మదరాసు రాజధాని కళాశాలలో కొన్ని నెలలు పండిత పదవి.

38. 1939 : రెడ్డిరాజ్య వర్ధంతి సభకు (రాజమహేంద్రవరము) అధ్యక్షుడుగా నుండుట

39. 1939 డిసెంబరు: మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో పండిత పదవి నుండి స్వచ్ఛంద విరమణము.

40. 1939—40: ఆంధ్ర, మదరాసు విశ్వవిద్యాలయములలో ఉద్యోగ యత్నము

41. 1940: తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాలలో ఆంధ్రశాఖకు అధ్యక్షుడుగా నుండుట. పరిశోధన సంస్థలో పండిత పదవి. ఆంధ్ర, మదరాసు, అణ్ణామలై 'స్టడీస్ బోర్డు' లలో సభ్యత్వము.

42. 1940—42: రంగనాథరామాయణ పరిష్కరణము.

43. 1943 డిసెంబరు26: వెంకట పార్వతీశ్వర కవుల సన్మాన సభకు వ్యాసము వ్రాసి పంపుట.

44. 1944 ఫిబ్రవరి 22: 'గౌరీ కళ్యాణము' (శ్రవ్యనాటిక) మదరాసు రేడియో కేంద్ర ప్రసారము.

45. 1944—45: అన్నమాచార్యుల రచనలు ప్రచురించుటకు తిరుమల తిరుపతి దేవస్థానము వారిని ప్రోత్సహించుట.

46. 1945: మెకంజీ లోకల్ రికార్డులలోని విషయములను ప్రచురించుట.

47. 1945 మార్చి 21: రీడరుగా శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధన సంస్థలో చేరుట. కీర్తిశేషులగు వరకా పదవిని నిర్వహించుట.

48. 1946 జనవరి 5 : ముక్త్యాలలో జరిగిన నవ్యసాహిత్య పరిషత్తు 11వ వార్షికోత్సవములో పాల్గొని "ఉపక్రమోపన్యాసము" ఇచ్చుట.

49. 1948 : నిరాడంబరముగా ఇంటిలో షష్ఠిపూర్తి సన్మానము. కాళహస్తి సంస్థానము నుండి ప్రాచీన గ్రంథములను సేకరించుట. 'ప్రజ్ఞాప్రభాకరము' రచనా సంకల్పము.

50. 1948 ఫిబ్రవరి 8 : మదరాసు రేడియో కేంద్రము నుండి మహాత్ముని గూర్చి ప్రసంగము.

51. 1949 అక్టోబరు: చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి ఆస్థానకవి పట్ట ప్రధానోత్సవము నాటి సాయంకాల సభకు అధ్యక్షులుగా నుండుట. నాటి సభకు ప్రారంభకులు ఆంధ్రకేసరి.

52. 1949 అక్టోబరు : శ్రీనాథ జయంత్యుత్సవ సందర్భమున సన్మానము. సన్మానము చేసినవారు మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు.

53. 1949: స్వీయచరిత్ర రచనము, ముక్త్యాలరాజు సహాయముతో శిల్పకళాఖండముల సేకరణ, అన్నమాచార్యుల విగ్రహములను వెలుగులోనికి తెచ్చి తిరుపతి దేవస్థానమువారిచే ఉత్సవములు జరిపించుట— మ్యూజియమును ఏర్పాటు చేయుటకై ప్రోత్సహించుట.

54. 1950 ఫిబ్రవరి 11 : ఆంధ్ర ఇతిహాస పరిశోధక మండలి (రాజమహేంద్రవరము) ఆధ్వర్యమున సన్మానము.

55. 1916 నుండి 1950 వరకు ఎడతెగకుండ రచనలు చేయుటతో పాటు అసిధారావ్రతముగా యోగసాధనము, తన్మూలమున వ్యాధులనివారణము —ఆర్తసేవ.

56. 1950 ఆగస్టు 29 మధ్యాహ్నము 12-30 గంటలకు నిర్యాణము.

# 3

# కావ్యాలు

## I లఘుకృతులు

1. మూన్నాళ్ల ముచ్చట: ప్ర. ము: 1922, ప్రకా: మణిమంజరి, తిరువలి క్కేణి, మదరాసు 1/8 క్రౌను, పుటలు: 32.
2. దివ్య దర్శనము: భారతి, ఫిబ్రవరి, మార్చి 1924. గ్రం: రూ: 1954 శ్రీ ప్రభాకర పరిశోధకమండలి, ముక్త్యాల, కృష్ణాజిల్లా, 1/8 క్రౌను, పుటలు: 36
3. కడుపుతీపు: భారతి, డిసెంబరు 1924, పు: 1-3, జనవరి 1925, ఆగస్టు 1925, పు: 66,67, సెప్టెంబరు 1925, పు: 12-16. గ్రం: రూ: 1925 1/8 క్రౌను, పుటలు: 32.
4. కపోతకథ: భారతి, నవంబరు 1925, పు: 22—28, డిసెంబరు 1925, పు: 189—194, గ్రం: రూ: 1925, పుటలు: 2+28, ద్వి. ము: ?
5. విశ్వాసము: భారతి, డిసెంబరు 1926, పు: 1—6, గ్రం: రూ: 1926, 1/8 క్రౌను, పుటలు: 15.
6. చిన్ననాటి చేష్టలు: భారతి, అక్టోబరు 1928, పు: 638—640, నవంబరు 1928, పు: 771—773, గ్రం: రూ: 1928, 1/8 క్రౌను, పుటలు: 16.
7. శివరామ ప్రసాద బహద్దరు జమీందారుగారి పట్టాభిషేక ప్రశంస, గ్రం. రూ: 1929, 1/8 క్రౌను, పుటలు: 21
8. చిన్ననాటి చేష్టలు—సీతాఫలము; భారతి, సెప్టెంబరు 1940
9. మాతృశ్రీ; ఆంధ్రపత్రిక, 1944, పుటలు: 60—64.
10. అలవాటు: సరస్వతి.

11. సత్రశాల (అము)
12. పూలవిందు (గేయకృతి—అము—అసమగ్రము)

## II పద్యావళి

1. నూతన వర్షము: ఆంధ్రభారతి, 21-6-1911, పుట: 502.
2. శ్రీనివాస నిర్యాణము: కృష్ణాపత్రిక, 24—11—1911, పుట: 4, మణిమంజరి, ఆగస్టు 1981, పుట: 117
3. పంచమజార్జి పట్టాభిషేక ప్రశంస (ఈ పద్యముల చివర "శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, శతావధాని, చెన్నపట్టణము" అని వ్రాసియున్నది) సరస్వతి, డిసెంబరు 1911
4. పరిణయాశీస్సు: ఆధునిక కవి జీవితములు అను హైమవతీ పరిణయము, 1916 పుట: 327.
5. తిరుపతి కవి స్మృతి పద్యములు: ఆంధ్రపత్రిక (సంవత్సరాది సంచిక) 9-4-1921, పుటలు 209, 210.
6. రాధాకృష్ణ నాటక ప్రయోగ ప్రశంస (కరపత్రం) 1—3—1924.
7. చిత్రనళీయ నాటక ప్రయోగ ప్రశంస (కరపత్రం) 5—3—1924.
8. మైలవరం బాలభారతీ నాటక సమాజ ప్రశంస (కరపత్రం) 11-3-1924
9. ఆశంసనము: ఆంధ్రపత్రిక, 5-4-1924.
10. ముద్దుబిడ్డడు: భారతి, జులై 1924, పుట: 76.
11. గాంధీమహాత్ముని ఉపవాసదీక్ష: ఆంధ్రపత్రిక, 24-9-1924.
12. భారతీ ప్రశంస: భారతి, జనవరి 1925, (మొదటి పుటలో)
13. మహాత్మునకు స్వాగతం: ఆంధ్రపత్రిక, 7—3—1925.
14. శ్రీకాళహస్తి—శివరాత్రి: భారతి, మార్చి 1925, పుట: 77.
15. నీవే శరణమిక తండ్రీ!: ఆంధ్రపత్రిక, 21—5—1925. మణిమంజరి, ఫిబ్రవరి 1982, పుటలు:95—96.
16. తిరుపతి వేంకటేశ్వర స్వామి. ఆంధ్రాభ్యుదయము, ఎప్రెల్ 1926.

17. శరణార్థి: సుభాషి, అక్టోబరు 1927, పు: 51,53. మణిమంజరి, ఫిబ్రవరి 1982, పు: 1-3.

18. కీ॥ శ॥ చల్లపల్లి జమీందారుగారు: త్రిలింగ, 16-7-1928.

19. రాజరాజనరేంద్ర ప్రశంస; కృష్ణాపత్రిక, 10-11-1928 ది 17-11-1928, (రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక 1922)

20. సూక్తినిధి: అభినవ తిక్కన (తుమ్మల సీతారామమూర్తి చౌదరి సన్మాన సంచిక) 12-7-1942.

21. అమరావతీ శిల్పములు: భారతి, 1-1-1943, పుట: 442.

22. స్వాతంత్ర్య గీతాలు: మణిమంజరి, ఆగస్టు 1981, పుట: 76.

23. జిజ్ఞాసువు: మణిమంజరి, ఆగస్టు 1981, పుట. 111

(క్రింది వానికి తేదీలు లభించవలసియున్నది)

24. ఆశీర్వచన నవరత్నములు

25. తొయ్యలిబాసి దేశ సంచారము: సరస్వతి

26. దక్షిణాంధ్ర బాలకుడా! : దక్షిణాంధ్ర పత్రిక.

27. నాగతి: ఆంధ్రి

28. అభినందనము:

29. ఆత్మేశ్వరా! :

30. ఆశీర్వచనము:

31. ఇల్లాలితో:

32. కృతార్థుడు:

33. గాంధీ వచ్చినప్పుడు:

34. నానా:

35. పెండ్లి ముచ్చట:

36. భోగరాజు పట్టాభి సీతారామయ్య:

## అనువాదములు

37. గోవర్ధన సప్తశతి: ఆంధ్రభారతి, ఫిబ్రవరి 1928, పుట: 36
38. ఏణీ పంచకము: సరస్వతి, రుధిరోద్గారి, చైత్రము.
39. తిరుప్పావై సప్తపదులు:
40. గాథా సప్తశతి: పరిశోధన, ఆగస్టు, సెప్టెంబరు 1954, పుట: 56.
41 భజగోవిందం: మణిమంజరి, ఫిబ్రవరి 1981, పుటలు: 57—59.
42. సనత్సుజాతీయము: మణిమంజరి, ఫిబ్రవరి 1981, పుటలు: 80—86.

(28 నుండి 36 వరకుగల ఖండికలు ప్రభాకర పరిశోధక మండలివారు సేకరించి భద్రపరచిన వ్రాతప్రతులు ఆధారముగా గుర్తించినవి)

## 4

# రూపకాలు

1. కర్ణభారము (భాసకృతికి తెనుగుసేత) ప్ర. ము : 1913, ప్రకా : కె. వెంకటశేషయ్య, మద్రాసు. ద్వి॰ము : 1956, ప్రకా : శ్రీ ప్రభాకర పరిశోధక మండలి, హైదరాబాదు, 1/8 క్రౌన్, పుటలు : 16
2. మధ్యమ వ్యాయోగము (భాసకృతికి తెనుగుసేత) ప్ర. ము : 1913, కె. వెంకటశేషయ్య, మద్రాసు. 1/8 క్రౌను, 24
3. భగవదజ్జుకము (బోధాయనకృతికి తెనుగుసేత) భారతి, సెప్టెంబరు 1924, పు : 46—53; అక్టోబరు 1924 పు : 33-40; నవంబరు 1924, పు. 37—43; గ్రం. రూ: ప్ర. ము: 1924, ప్రకా: వేటూరి శంకరశాస్త్రి, మణిమంజరి, తిరువలిక్కేణి, మద్రాసు, 1/8 క్రౌను, 33.
4. ప్రతిమా నాటకము (భాసకృతికి తెనుగు సేత) భారతి జులై 1927, పు: 29—37; ఆగస్టు 1927 పు: 37—45: సెప్టెంబరు 1927 పు: 43—52; అక్టోబరు 1927 పు: 68—85; డిసెంబరు 1927 పు: 29—51; గ్రం. రూ: ప్ర. ము: 1927; ద్వి. ము: 1934; తృ. ము:....
5. మత్తవిలాసము (మహేంద్ర విక్రమవర్మ కృతికి తెనుగు సేత) చంద్రిక, 1934 (జనవరి సంచిక) గ్రం. రూ: ప్ర. ము: 1935, వేటూరి శంకర శాస్త్రి, మణిమంజరి, డెమ్మీసైజు, పుటలు: 36.
6. నాగానందము (హర్ష కృతికి తెనుగు సేత) ప్ర. ము: 1954, శ్రీ ప్రభాకరశాస్త్రి పరిశోధక మండలి, ముక్త్యాల. 1/8 క్రౌను, 152 (ఈ నాటకము వేటూరివారు రెండంకములు, దివాకర్ల వేంకటావధాని గారు మూడంకములు తెనిగించిరి)
7. గౌరీ కళ్యాణము (అము) మదరాసు రేడియో కేంద్ర ప్రసారము : 22-2-1944.

# 5

# వచన రచనలు

## I వచన గ్రంథములు

1. కనకాభిషేకము: ప్ర.ము: 1913 ప్రకా: కె వెంకటశేషయ్య, మదరాసు 1/8 క్రౌను, పుటలు: 22.
2. శృంగార శ్రీనాథము: ప్ర. ము: 1923 1/8 క్రౌను, పుటలు 327.
3. శాసన విశేషములు: ప్ర. ము: 1924 ప్రకా : వావిళ్ల రామస్వామి శాస్త్రులు చెన్నపురి, క్రౌను, పుటలు: 16.

## II కథలు

1. కామధేనువు కథ: గ్రం. రూ: 1914, కె. వెంకటశేషయ్య, డెమ్మీ సైజు పుటలు: 16.
2. కలికి చిలుక: భారతి, జూన్ 1924, పుటలు 100—107; మణిమంజరి, అగస్టు 1982, పుటలు: 135—140.
3. కరుణకము: భారతి, ఆగస్టు 1924, పుటలు: 123—132.
4. మేనత్త: ఆనందవాహిని, 1-2-1930 పుటలు: 55—60; 1-3-1930 పుటలు: 108—112.
5. తక్రానందస్వామి: ఆనందవాహిని, 1-10-1930 పుటలు: 322—332
6. బొంగరం—ఉంగరం: బాల, మార్చి 1946 పు: 57—59.
7. మనుమరాలు: బాల, జూన్ 1946, పు: 66—67.
8. కాకి పగ:
9. పల్లెటూరిబావ:
10. సతీపరాభవము:

## III స్వీయ చరిత్ర

ప్రజ్ఞాప్రభాకరము: ప్ర. ము: 1951, యోగమిత్ర మండలి, మద్రాసు; ద్వి. ము: 1976, శ్రీ ప్రభాకర పరిశోధక మండలి, తిరుపతి 1/8 క్రౌను, 156.

## IV అనువాదములు

నీతినిధి: ప్ర. ము: 1926, ఆంధ్ర గ్రంథమాల; ద్వి. ము: 1982 వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు, హైదరాబాదు, డెమ్మీ, పుటలు: 45+154.

# 6

# వ్యాసాలు

a) సాహిత్య శాసన భాషా చారిత్రక వ్యాసాలు

1. తాళపత్ర గ్రంథములు (సా) కృష్ణా పత్రిక, 10—1—1914.
2. సి.పి. బ్రౌను దొరగారు— ఉత్తర ప్రత్యుత్తరములు (సా) ఆంధ్ర పత్రిక, 1—6—1914.
3. వసుచరిత్రము (సా) ఆంధ్రపత్రిక, 10—6—1914.
4. ద్విపద కృతులు (సా) ఆంధ్ర పత్రిక, 10—8—1914.
5. సి.పి. బ్రవును వారి యుత్తరము (సా) ఆంధ్ర పత్రిక. 11—9—1914.
6. వనితల కవితలు (సా) ఆంధ్ర పత్రిక, 31—8-1914; 14—9—1914.
7. వాడుక భాష (సా) కృష్ణా పత్రిక, 12-9—1914.
8. ఆంధ్ర నాటక రచనము (సా) కృష్ణా పత్రిక, 23—9—1916.
9. లవంగి (చ) కృష్ణా పత్రిక, 14—10—1916.
10. ఆంధ్ర శబ్దానుశాసనము (సా) కృష్ణా పత్రిక, 16—12—1916.
11. మధుర కవితలు (సా) కృష్ణా పత్రిక, 23—12 1916.
12. చరిత్రాంశము (చ) కృష్ణా పత్రిక, 23—12—1916.
13. ఏనాదులు (చ) కృష్ణా పత్రిక, 13.1.1917.
14. లక్షణ గ్రంథములు (సా) కృష్ణా పత్రిక, 20.1.1917.
15. మధుర గీతములు (సా) కృష్ణా పత్రిక, 10.3.1917.

16. గ్రామ్య మీమాంస (భా) కృష్ణా పత్రిక, 31 3.1917.

17. మధుర రచనలు (సా) కృష్ణా పత్రిక, 21.4 1917.

18. రాజులు– కవితలు (సా) కృష్ణా పత్రిక, 21.4.1917.

19 ప్రబంధ రత్నాకరము (సా) కృష్ణా పత్రిక, 2.6.1917.

20. నాడీ గ్రంథములు (చ) కృష్ణా పత్రిక, 6.10.1917; మణిమంజరి ఆగస్టు 1981 పుటలు: 119–122.

21 ఆంధ్ర కవుల చరిత్ర–నన్నయభట్టు (సా) కృష్ణా పత్రిక, 8.12.1917.

•22. ప్రభావతీ ప్రద్యుమ్న వ్యాఖ్యా విమర్శనము (సా) కృష్ణా పత్రిక, 19 1.1918; 16.3.1918; 11.5.1918;

23 వాడుక భాష లేఖ (భా) తెలుగు (మాసపత్రిక) సెప్టెంబరు 1919.

24 శివతత్వసారము (సా) ఆంధ్ర పత్రిక, 9.10.1919

25. శంకర విజయ గాథ (సా) ఆంధ్ర పత్రిక (సారస్వత అనుబంధం) 20.1.1922.

26. కృష్ణరాయుడు– పెద్దన (సా) ఆంధ్ర పత్రిక, 28.1.1922

27 శ్రీకాకుళ క్షేత్రము (చ) ఆంధ్ర పత్రిక (సారస్వత అనుబంధం) 15 2.1922; 25.2.1922.

28. సారంగధరుని కథ (చ) ఆంధ్ర పత్రిక (సారస్వత అనుబంధం) 5.5.1922

29. బ్రహ్మశ్రీ వడిమింటి మంగశేశ్వర శాస్త్రులు (చ) త్రిలింగ, 25.11 1922; 23.12.1922.

30. ప్రాచీన సంస్కృత రూపకములు (సా) సరస్వతి, మార్చి 1923; ఏప్రెల్ 1923.

---

•ఈ విషయముపై పది వ్యాసములు వ్రాసినట్లు శాస్త్రిగారు చెప్పు కొన్నారు. కాని అవి మూడు మాత్రమే కృష్ణా పత్రికలో కనిపించు చున్నవి. చూ: మణిమంజరి, ఆగస్టు 1981 పుట:103

31.• జాయపసేనాని. సరస్వతి, ఆగస్టు 1923.

32.• విద్యానాథుడు—అగస్త్యుడు: సరస్వతి, సెప్టెంబరు 1923.

33.• విశ్వనాథకవి— నరసింహకవి: సరస్వతి, అక్టోబరు, నవంబరు 1923.

34.• చెన్నుభట్టు విశ్వేశ్వర కవిచంద్రుడు: సరస్వతి. సెప్టెంబరు 1924.

35.• పశుపతి నాగనాథుడు— గౌరన: సరస్వతి, అక్టోబరు. నవంబరు 1924.

36. రెడ్డిరాజుల ప్రశంస—రెడ్డిరాణి (సచిత్ర మాసపత్రిక) అక్టోబరు 1923 పు;3.

37. సి.పి. బ్రౌను దొరగారు (చ) త్రిలింగ 15.12.1923

38. నాటకకళ (సా) కళ, డిసెంబరు 1923, పుటలు: 201—208.

39. ద్విపద భారతము (సా) రెడ్డిరాణి, జనవరి 1924, పుట : 105

40. రెడ్డిరాజుల చరిత్ర (చ) రెడ్డిరాణి, మార్చి 1924, 178—180. ఏప్రిల్ 1924, 209—212; సెప్టెంబరు 2924, 372;

41. కొండవీడు కైఫీయతు (చ) రెడ్డిరాణి, డిసెంబరు 1924, 121—128

42. వేమన కాలము (చ) ఆంధ్ర పత్రిక, 25-3-1925, 218—220.

43. నారాయణ తీర్థులు (చ) భారతి, జూన్ '925; జూలై 1925, 147. 148.

44. "వినోద విమర్శనము" సర్వలక్షణ సార సంగ్రహము—విమర్శ (సా) భారతి, నవంబరు 1927, 41—45.

45. శివయోగసారము అవతరణిక (సా) సుభాషి, నవంబరు 1927, 74-79.

46. "వినోద విమర్శనము" స్థాన శబ్ద విచారము (భా) సుభాషి, డిసెంబరు 1927.

47. ఇక్ష్వాకులు (చ) భారతి, జనవరి 1928, 134—141; బుద్ధజయంతి సంచిక, 1956, 48—54.

---

• తెలుగు దేశపు సంస్కృత కవులు అను పేరుతో 'సరస్వతి'లో ప్రకటింపబడినవి.

48. పునర్విమర్శనములు (నేపాళ చోళ శబ్దములు) (భా) భారతి. మార్చి 1928, 487 - 489.

49. "వినోదవిమర్శనము" (సా) భారతి, మార్చి 1928, 392-397.

50. అనంతవరం తామ్ర శాసనము (శా) ఆంధ్రపత్రిక, మార్చి 1928, 167—180.

51. విమర్శ విమర్శను (సారంగధర చరిత్రను గూర్చి విమర్శ (సా) భారతి, మే 1928, 810—814.

52. ప్రాచీనాంధ్ర శాసనములు (శా) భారతి, జూన్ 1928, 933—949. 1928, 286—301.

53. అహదనకర తామ్రశాసనము (శా) భారతి, జులై 96—110; ఆగస్టు 1928, 286-301.

54. అహదనకరశాసనము (పునర్విమర్శనము) భారతి, సెప్టెంబరు 1928, 520-529.

55 ఛార్లెస్ ఫిలిప్ బ్రౌను దొరగారు (చ) త్రిలింగ, 1.9.1928.

56. ఏకమూరు శాసనము (చ) రెడ్డిరాణి, ఫిబ్రవరి 1929, 13.

57. షష్ఠీసమాసము : త్రిలింగ, 8.4.1928.

58 తెలుగు పలుకుబళ్లు (భా) ఆనందవాహిని, అక్టోబరు 1930, 333-338.

59. యక్షగానము (పుట్టుపూర్వోత్తరాలు) (సా) భారతి, మే 1939, 511—519.

60. శ్రీనాథుని కాశీఖండము (సా) ఆంధ్రపత్రిక, 15.5.1940.

61. శ్రీనాథుని కాశీఖండము (ఒక్క ముక్క) (సా) ఆంధ్రవారపత్రిక, 31.7.1940.

62. నన్నయకు పూర్వము ఆంధ్రభాష(భా)ఆంధ్రపత్రిక, 28.3.1941 పు.8

63. చాటువులు (చిత్ర కవితా రచనలు)(సా)ఆంధ్రవారపత్రిక 15.7.1942

64 సాహిత్యం : ఆంధ్రపత్రిక, 26.4.1943; మణిమంజరి, ఫిబ్రవరి 1982 80.83.

65. క్షేత్రయ అక్షరాక్షరమును పరమ ప్రమాణమే (సా) ఆంధ్ర పత్రిక, 5.3.1944; 'స్మృతిపథంలో' అను పేరుతో—మణిమంజరి, ఆగస్టు 1981, 112–116.

66. టుమ్రీలు (చ) ఆంధ్రపత్రిక, 2-4-1944.

67. గాలికబుర్లు (నిందావర్గం) (భా) ఆంధ్ర పత్రిక, 4.6.1944.

68. ఏలపాటలు (తెలుగు నుడికారపు సొంపు) (సా) ఆంధ్రపత్రిక, 11–6–1944.

69. కాటమరాజుకథ చ) ఆంధ్రపత్రిక, 18.6.1944, 24.6.1944; 4.8.1944;

70. మల్లకుమార అనంతరాజు : ఆంధ్రపత్రిక, 29.7.1945.

71. ఉపలబ్ధ, అముద్రిత ప్రాచీనాంధ్ర గ్రంథములు (సా) భారతి, మే 1946, 411–418.

72. ఆంధ్రదేశపు జానపద గీతాలు : ప: ? 26.6.1947.

73. నేటి తెలుగు-నోటితెలుగు (భా) ఆంధ్రపత్రిక, 1948, 303–308; మణిమంజరి, ఫిబ్రవరి 1982, 4–7

74. తాళపత గ్రంథాలు (సా) వాణి, 7.6.1950.

75. భాషా వికాసము (సా) పరిశోధన, ఆగస్టు—సెప్టెంబరు 1954, 2–5

76. దేశి సాహితి సొంపు (సా) పరిశోధన, ఆగస్టు - సెప్టెంబరు, 1954, 22–24, సారస్వత వ్యాసములు(4-వ సంపుటము) ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ, 1971, 1–6.

•77. కట్టు కథలు (సా) పరిశోధన, ఆగస్టు- సెప్టెంబరు 1954, 57–60.

•78. సజీవ రచన (సా) ఆంధ్రభూమి, 31-8-1980; మణిమంజరి, ఫిబ్రవరి 1982, 73–76.

79. కళింగ దేశము—ప్రాచీన గ్రంథములు (సా) మణిమంజరి, ఫిబ్రవరి 1981, 10–13.

---

• రేడియో వ్యాసములు.

•80. ఆస్థాన కవి నిర్యాణము : మణిమంజరి, ఆగస్టు 1981, 150, 151.

•81 జ్ఞాపకాలు : మణిమంజరి, ఫిబ్రవరి 1982, 86–89.

•82. జ్ఞాన సంపద : మణిమంజరి, ఆగస్టు 1982, 149–152.

83. నీతి ద్విషష్టిక (ఉపోద్ఘాతము) మణిమంజరి, ఆగస్టు 1982, 153-158.

b ఇతరములు

1. ఎఱ్ఱగడ్డ వారి పోరాటము: కృష్ణా పత్రిక, 7.4.1911
2 కృష్ణ వరదలు—ఘోరవిపత్తు: కృష్ణాపత్రిక, 2.8.1912
3. పెద్దకళ్లేపల్లి వృత్తాంతము: కృష్ణా పత్రిక, 2.8.1912
4. కృష్ణరాయల పత్నులు: ఆంధ్రపత్రిక, 18.12.1914.
5. తంజావూరి రాజుల విగ్రహములు: ఆంధ్రపత్రిక, 10.9 1919.
6. ప్రాచీన వస్త్ర పరిశ్రమ: త్రిలింగ, 27.5.1912; ఆంధ్రపత్రిక 27.2.1944.
7. వృక్షాయుర్వేదము: త్రిలింగ, 26.8.1912.
8. సుభోజనము: సరస్వతి, ఫిబ్రవరి 1925.
9. జయంతి కామేశము పంతులుగారు: ఆంధ్రపత్రిక, ఏప్రెల్ 1925.
10. పాటలీ పుష్పము (పొదిరి చెట్టు): భారతి, జులై 1928.
11. పూర్వకాలపు పల్లెటూళ్లు: ఆనందవాహిని, 1.3.1930.
12. ఈశ్వర కరుణామృతము: ఆంధ్రపత్రిక, 17.7.1940
13. హైదరు చరిత్ర: ఆంధ్రపత్రిక, 18.2.1944; 5.3.1944; 31.3.1944; 12 5.1944.
14. తల టోపీ తురుష్కుల నుంచి వచ్చిందా? ఆంధ్రపత్రిక, 27.2.1944.
15. ఆమె పరమ ప్రాప్యము గాంధిగారి అంతరాత్మయే; ఆంధ్రపత్రిక, 5 3.1944.

---

• రేడియో వ్యాసములు.

16. బ్రౌను జాబు (బ్రౌనుకు వ్రాసిన ఉత్తరము) త్రిలింగ, 12.3 1944.
17. ఉదయగిరి జాగీరుదారు చరిత్ర (లోకల్ రికార్డులనుంచి) ఆంధ్రపత్రిక, మార్చి 1944.
18. భుక్తిపత్రి; ఆంధ్రపత్రిక, 16.4 1944.
19. బ్రౌను దొరనాటి దయ్యాల వృత్తాంతము: త్రిలింగ, 23.4.1944.
20. ముఖస్తుతికి ఏవగింపు: త్రిలింగ, 21.5.1944.
21. రైతుల కష్టాలు—కన్యకా విక్రయం: ఆంధ్రపత్రిక, 28 5.1944.
22. వేంచేసినారు: ఆంధ్రపత్రిక, 20 8.1944.
23. పుష్పగిరి క్షేత్ర యాత్ర వృత్తాంతము (లోకల్ రికార్డులనుంచి) ఆంధ్రపత్రిక, 24.9.1944; 8.10.1944.
24. దళవాయి సాంబయ్య: ఆంధ్రపత్రిక, 22.10.1944.
25. ఆనంద గణపతి బాల్యంలో: ఆంధ్రపత్రిక, 29.10.1944.
25. సామాన్య వనితా శాపం (లోకల్ రికార్డులనుంచి) ఆంధ్రపత్రిక? 12.11.1944.
27. కాకతి గణపతిరాజు ఘనత: ఆంధ్రపత్రిక, 31.12.1944.
28. వేంకటపతిరాయలు: ఆంధ్రపత్రిక, 30.4.1945.
29. ప్రార్థనము: ఆంధ్రపత్రిక, 7.10.1945.
*30. భవభూతి అడుగుజాడల్లో బాపూజీ: ఆంధ్రపత్రిక, 21.1.1946.
31. దేశావృతమైన దుర్భిక్ష మహాక్షోభం: ఆంధ్రపత్రిక, 17.2.1946.
32. సర్వకాలాలకూ, సమస్త మానవ జాతికీ బాపూజీ సందేశం శిరోధార్యం: ఆంధ్రప్రభ, 12.2.1948.
33. స్వాతంత్ర్య దినోత్సవము: మణిమంజరి, ఆగస్టు 1981.
35. దాక్షారము అన్న సత్త్రమ్వు గంట; భారతి......

---

*చూడుము: నవ్య సాహిత్య పరిషత్తు—ఉపక్రమోపన్యాసము: మణిమంజరి, ఫిబ్రవరి 1982, పుటలు: 8—24.

# 7

# వ్యాససంపుటాలు

ఎప్పుడెప్పుడో పత్రికలలోను, రేడియోలోను ప్రకటితములు; అప్రకటితములునగు ప్రభాకరుల వ్యాసాలు సంకలనము చేయబడినవి. శాస్త్రిగారి వ్యాసములిట్లు సంకలన రూపమున వెల్వడుట "తెలుగు మెఱుగులు" తోడనే ఆరంభమైనది. "మీగడ తఱకలు" "సింహావలోకనము" ఈ వరుసలో వెల్వడినవే.

## 1. తెలుగు మెఱుగులు

ప్ర.ము: 1948, ఆంధ్రగ్రంథమాల; ద్వి ము....; తృము: 1960, శ్రీ ప్రభాకర పరిశోధక మండలి, హైదరాబాదు, 1/8 క్రౌను, 208

ఈ సంపుటములోని వ్యాసాలు:—

1. తెలుగుదనము: తెలుగు సంప్రదాయము
2. ఆంధ్రభాషావతారము: భారతి, ఆగస్టు 1928. పు: 177—181
3. ఆంధ్రకల్ప వృక్షము: భారతి, జూలై 1946, 62—64.
4. ప్రాచీన గ్రంథముల పలుకుబడికి మనపై చెల్లుబడి: ఆంధ్రపత్రిక, 3—9—1950
5. తెనుగు తేటదనము: భారతి, ఫిబ్రవరి 1941.
6. ఆంధ్రకవిత— పురాణయుగము:
7. ఆంధ్రకవిత- ప్రబంధ యుగము : Journal of Sri Venkateswara Oriental Institote, 1949?, 17-40.
8. అరసున్న : భారతి, మే 1928, 775-778.
9. వింత నిఘంటువులు : భారతి, ఏప్రెల్ 1940.

10. గ్రంథ గ్రంథులు : The Annals of Sri Venkateswara Oriental Institute, సం॥..., 108—118.
11. అవీ—ఇవీ : భారతి, నవంబరు 1939.
12. తెలుగున ప్రథమావిభక్తి 'ం డు' ఎట్లు పుట్టినది ? : భారతి, ఏప్రెల్ 1929, 475—477.
13. ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణము : భారతి, జూన్ 1939; రెడ్డి సంచిక 1947, 39?—413.
14. కవితా పారమ్యము (కవిరాజ హంసల కవితా పారమ్యము) ఆంధ్రపత్రిక, 26-12-1943.
15. ఆంధ్ర లిపి—సంస్కారము : భారతి, ఏప్రెల్ 1928, 590—598.

## 2. మీగడత అకలు :

ప్ర. ము: 1951, శ్రీ ప్రభాకర పరిశోధక మండలి, తిరుపతి, 1/8 క్రౌను, 232.

(ఈ సంపుటములోని వ్యాసాలు)

1. సాతవాహనులు : జయంతి, 1930.
2. శివ కవులు :
3. పండితారాధ్య చరిత్రము :
4. వేములవాడ భీమకవి (రేడియో ప్రసంగం, మద్రాసు, 20-9-1941.
5. ప్రాచీనాంధ్ర వచన కావ్యములు : ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక.
6. భాగవతము : సరస్వతి, 1924.
7. మధుర కవితలు : కృష్ణా పత్రిక, 16—6—1917.
8. కృష్ణరాయల విద్యాగోష్ఠులు : భారతి, ఏప్రెల్ 1925, 65—69.
9. ఉద్భటారాధ్య చరిత్రము : భారతి, మే 1925, 80—89.
10. మను చరిత్ర :
11. దక్షిణ దేశము నందలి ఆంధ్ర వాఙ్మయము : భారతి, జనవరి 1949, 346—353.

12. కొలచెలమవారు : ఆంధ్ర పత్రిక (సంవత్సరాది సంచిక) 10—5—1922, 183—186.

13. త్యాగరాజు (యోగివర్యుల కవితారీతులు—త్యాగయ్య)

14. ఆంధ్ర భాషావతారము : భారతి, ఆగస్టు 1928, 177—181.

15. వాఙ్మయ పరిణామము : భారతి, మే 1924, 1—4.

## 3. సింహావలోకనము :

ప్ర. ము : ? ; ద్వి. ము : 1955, శ్రీ ప్రభాకర పరిశోధక మండలి, హైదరాబాదు, 1/8 క్రౌను, 199.

(ఈ సంపుటములోని వ్యాసాలు)

1. నన్నయ్యకు పూర్వపు ఛందస్సు : రాజరాజ నరేంద్ర పట్టాభిషేక సంచిక, 1922.
2. రంగనాథ రామాయణము :
3. తెలుగు కవితలోని దేసితనము :
4. రెడ్డి రాజులు — ఆంధ్ర భాషా సేవ : హైదరాబాదాంధ్ర సాహిత్య — పరిషత్పత్రిక, ఏప్రెల్ 1946, 9—35; రెడ్డి సంచిక, ఆగస్టు 1947, 414—430.
5. అన్నమయ్య.
6. వచన రచన—తాళ్ళపాకవారు : (పీఠిక "శ్రీ వేంకటేశ్వర వచనములు" తిరుమల తిరుపతి దేవస్థాన ముద్రణము 1945)
7. హర విలాసము (పీఠిక—"హర విలాసము" వావిళ్ళవారి ముద్రణము 1939)
8. మను చరిత్రము.
9. శతావధాని వేంకటశాస్త్రి.

# 8

# పీఠికలు - వ్యాఖ్యలు - సమీక్షలు - గ్రంథపరిష్కరణలు

**పీ ఠి క లు :**

1. తంజావూరి ఆంధ్ర రాజుల చరిత్ర (కర్త : ?) ప్ర. ము: 1914, పు: 1—48.

2. ప్రబంధ రత్నావళి (సంపా: వేటూరి ప్రభాకరశాస్త్రి) ప్ర. ము: 1918; ద్వి. ము : 1976, ప్రభాకర పరిశోధక మండలి, హైదరాబాదు, పు: 9—32.

3. అప్పన చారుచర్య (కవి మంత్రి అప్పన) ప్ర. ము: 1922. చూడుము: చారు చర్య గ్రంథ విమర్శనము, ఆంధ్ర పత్రిక, 12-1-1923.

4. భగవద్ధ్యాన ముక్తావళి (శ్రీకాకుళ శ్రీహరి శతకము — శ్రీ ప్రోలిపెద్ది వెంకటరామశర్మ) ప్ర. ము: 1923. చూడుము. శ్రీకాకుళ క్షేత్రము, వ్యాసాలు.

5. భగవదజ్జుకము (బోధయనుడు) [సంస్కృతము/తెలుగు] ప్ర. ము: 1924. చూడుము: రూపకాలు.

6. ఉద్భటారాధ్య చరిత్రము (తెనాలి రామలింగ కవి) ప్ర. ము: 1925 సరస్వతీ గ్రంథమాల పు : 1—18. చూ: మీగడ తఱకలు.

7. మనుచరిత్ర (అల్లసాని పెద్దన) ప్ర. ము : 1926, వావిళ్ళ రామస్వామి అండ్ సన్స్, మదరాసు పు : 1—27. చూ: సింహావలోకనము.

8. ప్రతిమా నాటకము (భాసకృతికి శాస్త్రిగారి తెనుగుసేత) ప్ర. ము: 1927; ద్వి.ము: 1934; తృ. ము: ?, చూ: భారతి, డిసెంబరు 1927, పు: 49—51

9. బసవ పురాణము (పాల్కురికి సోమనాథుడు) ప్రి.ము: 1927, ఆంధ్రి గ్రింథమాల, 1—129

10. బసవోదాహరణము (పాల్కురికి సోమనాథుడు) ప్ర.ము: 1927. చూ: భారతి, ఫిబ్రవరి 1923, పు: 30—303.

11. సీతద్విషష్టికా (శ్రీసుందర పాండ్య విరచితము) (సంస్కృతము) ప్ర.ము 1928, ప్ర.కా: కె. మార్కండేయశర్మ. ద్వి.ము: 1981, సురభారతీ సమితి, హైదరాబాదు.

12. క్రీడాభిరామము (శ్రీనాథుడు) ప్ర. ము: 1928.ద్వి.ము: 1952; తృ.ము 1960, ప్రభాకర పరిశోధక మండలి, హైదరాబాదు, పు: 1—134.

13. బాలభాష (సంపా: వే.ప్ర.శా) 1930, చూ: 'ముగ్ధమధుర వాఙ్మయము' —'కళ'

14. ఉత్తర హరివంశము (నాచన సోమన) ప్ర.ము: 1936, వావిళ్ళ ముద్రణ పు: 16.

15. హరవిలాసము (శ్రీనాథుడు) ప్ర.ము: 1939, ఆనంద ముద్రణాలయము పు: 1—32. చూ: సింహావలోకనము

16. సుగ్రీవ విజయము (కందుకూరి రుద్రకవి) ప్ర.ము: 1939 చూ; 'మధుర కవితలు'— మీగడ తఱకలు.

17. భారతీ శతకము (గిడుగు వేంకట సీతాపతి) ప్ర.ము: 1939, నవ్య సాహిత్య పరిషత్తు, గుంటూరు, పు: 1—8.

18. మొయిలు రాయబారము (త్రిపురాన వేంకట సూర్యప్రసాదరావు) ప్ర.ము: 1940, వావిళ్ళ ముద్రణ, పు: 1—22.

19. గోవింద రామాయణము (ఆత్మకూరి గోవిందాచార్యులు) ప్ర.ము: 1942, పట్టాభిరామ ప్రచురణ, ఏలూరు, పు: 1—6.

ధకమండలివారు దివాకర్ల వేంకటావధానిగారిచేత మిగిలిన 3 అంకములను అనువదింపజే. ప్రకటించిరి. ఈ నాటకమున మలయవతీ జీమూత వాహనుల ప్రణయము, జీమూతవాహనుని త్యాగము నిరూపింపబడినవి. ఉత్తరార్థమందలి లోకోత్తర రసపోషణసం విధానముచే ఆకర్షితులై శాస్త్రిగారాంధ్రీకరణకు పూను కొనినారు. కాని పూర్తికాకముందే దివంగతులైరి. ఇందు పాత్రోచిత భాష వాడబడినది. అవధానిగారు శాస్త్రిగారి ననుసరించినారు.

7. *గౌరీకళ్యాణము:— శాస్త్రిగారు 5 అంకములుగా ఈ నాటకమును రచించి నారు. వ్యావహారికభాషలో ఈ నాటకము నడిచినది. నాంది "నల్లగొండం నాయకా! యెఱ్ఱగొండలయేలికా" అని ప్రారంభమగును. సింగడు, సింగి కలిసి ప్రస్తావనను నిర్వహింతురు. ఇది 22 అరఠావుల అముద్రిత నాటకము.

షష్ఠ ప్రకరణమున కవిసార్వభౌముని కర్ణాటదేశాటనము, సర్వజ్ఞ సింగభూపతి గ్రంథములు, బిరుదము, శ్రీనాథుడె భూపాలుని దర్శించుట మున్నగు విశేషములు చూపబడినవి

సప్తమ ప్రకరణమున కాశీఖండరచనము, వేమ వీరభద్రారెడ్లను శ్రీనాథు డాశ్రయించిన విధము, శ్రీనాథునకు కల్గిన చిక్కులు, పల్నాటి ప్రయాణము ముచ్చటింపబడినవి

అష్టమ ప్రకరణమున పల్నాటి వీర చరిత్రమును గూర్చియు, క్రీడాభిరామ కర్తృత్వముతో పాటు క్రీడాభిరామములోని పద్యములకు శ్రీనాథుని ఇతర కృతు లలోని పద్యములకుగల పోలికలను గూర్చియు చర్చింపబడినది. శివరాత్రి మాహాత్మ్యము మరియు శ్రీనాథుని పేరున లక్షణగ్రంథములందు పేర్కొనబడిన గ్రంథములను గూర్చియు విశదపరచబడినది.

నవమ ప్రకరణమున శ్రీనాథుని అవసానము, శ్రీనాథుని వ్యక్తిత్వము శృంగార జీవనము, మతము, ఇతరకవులతనిని స్తుతించిన విషయము మొదలగు నవి వివరింపబడినవి.

3. శాసన విశేషములు:—

భారత ప్రభుత్వము వారి "సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్ వాల్యూం *IV*" అను గొప్ప శాసన సంపుటములోగల ఆంధ్ర సంస్కృత శాసనములను చదివి నపుడు భాషావిషయమున, చరిత్రవిషయమున అపూర్వముగా తోచినవిశేషములను ప్రభాకరుడు గుర్తించినారు. శాసనసంఖ్యలు, పుటసంఖ్యలు, శకకాలాదులను సూచించుచు 22 శాసనములలోని విశేషములను ఈ పుస్తకమున వివరించినారు.

# II కథలు

1. కామధేనువు కథ:—

శాస్త్రిగారు సంస్కృతమునందున్న ఈ కథను వాడుకభాషలో వ్రాయుటకు ప్రోత్సాహము కల్గించినవారు శ్రీ రెంటాల వెంకటసుబ్బారావుగారు, ప్రొఫెసర్

అనంతరకాలమున హరిరామయ్య జీవితమునందు అంధకారమావహించినది గ్రామ వాసులకు అతని పాట అమంగళపుపాట అయినది కొత్తరకపు సంగీతము ముందు రామయ్యగారి శాస్త్రీయ సంగీతము వెనుకబడినది. అయినను అతడు సంగీత సాధన చేయుచునేవుండెను.

కొంత కాలమునకు హరిరామయ్య బెజవాడ రాజుగారిని దర్శించి సంగీత కళాశాలలో విద్వాంసుడుగా చేరుటకై ప్రయత్నించెను. కాని విఫలమనోరథు డయ్యెను

ఒకనాడు ఇద్దరు బాలికలు తోటలో పూలుకోయుచుండగా వారిపై పాములు బుస కొట్టి సాగినవి. అటువైపు వచ్చిన హరిరామయ్య పున్నాగ రాగము విని పించి పాముల నాడించ సాగినాడు. ఆ బాలికలెవరో కాదు రాజుగారి కూతుళ్లు వారి వలన హరిరామయ్య సంగీత ప్రతిభను తెలిసికొన్న జమీందారు ఇన్నూరు రూపాయలిచ్చి హరిరామయ్యను తీసికొనిరావలసినదిగా తన వారిని పంపినాడు వారు వచ్చి పలుకరించినంతలోనే హరిరామయ్య అసువులు అనంత వాయువులో కలిసిపోయెను.

ఈ కథకు 'శంకరాభరణం' సినిమా కథకు సామ్యము కలదని డా॥ వేటూరి ఆనందమూర్తిగారు భావించినారు *

4. మేనత్త :—

ఈ కథద్వారా ఆనాటి కుటుంబ పరిస్థితులు, పూర్వీకుల ఆచార వ్యవహార ములు తెలిసికొనవచ్చును.

5. తర్కానందస్వామి :—

ఇందు శాస్త్రిగారు మద్రాసులోనున్నప్పుడు జరిగిన సంఘటనలు వివ రించినారు. తర్కానందస్వామి పూర్వజన్మ కథను వర్ణించినారు. "ఈ జన్మపు అభిరుచులకు పూర్వజన్మ వాసనలు కారణమగుచుండును. తర్కానందస్వామి

* కరుణము (కథ) ఆంధ్రపత్రిక, 24–8–1980, 31–8–1980.

తత్క్రమాత్రాహారుడగుటకు పూర్వజన్మ సంస్కారమే కారణము, పూర్వజన్మ సంస్కారమునుబట్టి ఇహమున అనుకూలమైన ఆహార విహారములు గలవారగుదురు అను సందేశమునీ కథద్వారా శాస్త్రిగారు వెలువరించినారు.

# III స్వీయ చరిత్ర

"ప్రజ్ఞా ప్రభాకరము"

ప్రభాకరుల దివ్య ప్రజ్ఞామయమైన అనుభూతి విశేషము లిందు వర్ణింపబడినవి. 1948 లో శాస్త్రిగారు 'ప్రజ్ఞా ప్రభాకరము' రచనమున కుపక్రమించిరి. శాస్త్రిగారి నిశ్చితాభిప్రాయములు, ప్రవృత్తులు, వ్యాపకములనిందు వెల్లడింపబడినవి.

శాస్త్రిగారికి బాల్యము నుండియు అంధ విశ్వాసములయెడ నమ్మకము లేదు. పౌరోహిత్యమయిష్టము. శకునములు చూచుట వ్యర్థముగా భావించెడివారు.

ఖగోళ శాస్త్ర విజ్ఞానమును శ్రీ వేపారామేశంగారి ద్వారా పొందినారు. రామేశంగారు నిరంతర పఠనోత్సాహమున ప్రభాకరులకు మార్గదర్శకులు. వేశ్యాభినయ దర్శనమున ఏవగింపు, తనకు మేలొనర్చిన వారైనను వారియెడ కృతజ్ఞతాభావము కల్గియుండుట అన్నవి శాస్త్రిగారి కలవాటైనవి.

పండిత గోపాలాచార్యులు, రెంటాల వెంకట సుబ్బారావు, [illegible] అప్పారావు, వేదం వెంకట్రాయశాస్త్రి, కాశీనాథ నాగేశ్వరరావు పంతులు, టంగుటూరి ప్రకాశం పంతులు, పట్టాభి సీతారామయ్య, అయ్యదేవర కాళేశ్వరరావు, పనప్పాకం ఆనందాచార్యులు మొదలగువారితో శాస్త్రిగారికి గల సాన్నిహిత్య మెట్టిదో ప్రజ్ఞా ప్రభాకరము తేటపరచుచున్నది.

పావులూరి మల్లన గణితమును గూర్చి కందుకూరి వీరేశలింగం పంతులుగారు తలపడిన విధాన మిందు చిత్రింపబడినది.

తంజావూరు గ్రంథాలయమును గూర్చి ఆసక్తికరమైన విషయము లీ గ్రంథమున వ్రాయబడినవి. ప్రభాకరశాస్త్రిగారి ఆధ్యాత్మిక చింతనకు వారి స్వీయచరిత్ర అద్దము పట్టినది. కనుకనే వారి శిష్యులు డా॥ పోచిరాజు శేషగిరి రావుగారు "ఇది ప్రజ్ఞా చరిత్రమేకాని ప్రభాకర చరిత్రముకాదు" అని కొని యాడినారు. *

# IV "నీతి నిధి"

ఈ గ్రంథము ముక్త్యాల కుమార రాజాగారి కంకితము చేయబడినది. ఏడు, ఐదు అధ్యాయములతో ప్రథమ ద్వితీయ భాగములుగా విభజింపబడి యున్నది. ఆరు పుటల సంపాదకీయమును కాశీనాథ నాగేశ్వరరావుగారు కూర్చిరి. శాస్త్రిగారు వ్రాసిన పంచరత్నములు (కుమార రాజాగారికి సంబంధించినవి) ఉన్నవి. నీతి నిధి మొదట ఏ భాషలో ప్రచురింపబడినదో తెలియరాదు. ఆంగ్లాను వాదకారుని పేరును లేదు. కాని అతడు చస్టరుఫీల్డు ప్రభువునకు వ్రాసిన ఉత్తరము (12–5–1749) ఇందు పదకొండు పుటలలో ప్రచురింపబడినది. ఆంగ్లమున ఈ గ్రంథమునకు గల పేరు "*The Economy of Human life.*" మానవ జీవితమును సంస్కరించు నుద్దేశముతో నిందలి నీతులు పొందుపరుచబడినవి. 1751 నుండి 1812 నాటికి గ్రంథము యాబదిమారులు ఆంగ్లమున ముద్రింప బడినది. ఇందు మానవుని ధర్మములు, మనోవికారములు, మనుష్యులతో దైవికములైన తారతమ్యములు, సాంఘిక ధర్మములు, మానవ సామాన్య విషయములు, స్వపరానర్థకములగు వ్యామోహములు, తప్పించుకోరాని దైవిక ములు మున్నగువాని సంబంధమైన నీతులు కోకొల్లలుగానున్నవి. ప్రభాకరశాస్త్రి గారీ గ్రంథమును సులభ సుందర శైలిలో అనువదించి తెలుగు భాషా ప్రియు లకు అందించినారు.

---

* ప్రజ్ఞా ప్రభాకరము-ఒక పరిశీలన, మణిమంజరి, ఫిబ్రవరి 1982 పుట : 91.

# వ్యాసాలు

## (a) సాహిత్య శాసన భాషా చారిత్రక వ్యాసాలు.

1 తాళపత్ర గ్రంథములు :

[ఈ వ్యాసమున శాస్త్రిగారు తాళపత్ర గ్రంథముల సేకరణ ఆవశ్యక తను వివరించి అట్టివానిని విక్రయించినచో కొనగలనని ప్రకటించినారు.]

2. సి.పి. బ్రౌను దొరగారు :

[పరిశోధకులు బ్రౌను చరిత్రను వ్రాయవలెనని ఆశించినారు. ఆ ప్రయత్నములో పలువురి లేఖలు సేకరించి ప్రచురించినారు. ఇందు వఠ్యం అద్వైత బ్రహ్మశాస్త్రిలు 25–8–1833 నాడు బ్రౌనుకు వ్రాసిన లేఖ ప్రకటింప బడినది]

3. వసుచరిత్రము :

[సంస్కృత మూలశ్లోకములు–తెలుగుపద్యములు వీనికిగల తారతమ్యము నిరూపింపబడినది.]

(వసుచరిత్రమున గొప్ప గొప్ప కల్పనలు గలవు. కాని కథావిధానమున పసలేదు. కథలేకయే అంత గ్రంథ మట్టి కల్పనలతో రచించుట ఘనతయే యగును.)

4. ద్విపదకృతులు :

[ఇందు సోమనాథుని 'ద్విపద' రచనా విధానముతోపాటు అతని 'ప్రాస యతి'ని గూర్చి వివరముగా తెలుపబడినది ]

5. సి పి. బ్రౌనువారి యుత్తరము :

[3–1–1834 లో పైడిపాటి వెంకటనరసయ్యకు బ్రౌను వ్రాసిన ఉత్తరములోని విశేషములను శాస్త్రిగారు వెల్లడించినారు.]

6. వనితల కవితలు (1) :

(పెద్దనాదుల కాలమునుండి కులకాంతలు చదువదగిన కావ్యములు లేవు. రాజ్యవ్యవస్థ భిన్నాభిన్నమగుటచేత రాయల తర్వాత చక్కని కవిత్వముచెప్పెడి కవులు కరువైనారు. రఘునాథరాయల ఆస్థానము నలంకరించి, గోవిందదీక్షితుల ప్రశంసలు పొంది, కవిచౌడప్ప నోట 'మాటాడను వారిజభవు నంతవాని వశమా తంజావూరి సభన్" అని పల్కించిన మధురవాణి ప్రత్యేకత కొనియాడదగినది) [మొల్ల గురించి వ్రాయబడినది ]

2. [విజయరాఘవుని ప్రియురాలును, ఆస్థానవిద్వాంసురాలును అయిన రంగాజమ్మ చరిత్ర తెలుపబడినది.]

7. వాడుక భాష :

[ఇందు వ్యవహారములోని పదములను కావ్యములనుండి ఉదాహరించుటయే కాక, అట్టి గ్రంథములను శాస్త్రిగారు వెల్లడించినారు]

8. ఆంధ్ర నాటక రచనము :

[కోలాచలము శ్రీనివాసరావు ఆంధ్రనాటక రచనమునకు కొన్ని సూచనలు చేసినారు. శాస్త్రిగారు వారితో ఏకీభవించక తమ అమూల్యమైన అభిప్రాయములు వెల్లడించినారు.]

9. లవంగి :

(ప్రౌఢదేవరాయల కాలమున శోణగిరినాథుడను కవి ఢిల్లీకి వెళ్ళి పండితుల నోడించి ఢిల్లీశ్వరుని కూతురును 'లవంగి'ని వివాహమాడినట్లును, డిండిమ, కవిసార్వభౌమాది బిరుదము లందినట్లును విభావ రత్నమాల అను గ్రంథము (సంస్కృతము)న వ్రాయబడినది. కావున లవంగి గాథ పండితరాయలకు కాక డిండిమునికి ప్రసక్తించినదనుట కాధారమేర్పడుచున్నది.)

10. ఆంధ్రశబ్దానుశాసనము :

(ఆంధ్రశబ్దచింతామణి నన్నయ కృతముగా నిరూపింపలేము. ఆంధ్రశబ్దానుశాసనకర్త సంస్కృత, ప్రాకృత వ్యాకరణ పాండిత్యము కలవాడు)

11. మధుర కవితలు :

[ఈ వ్యాసమున భక్తి శృంగారములు వెలార్చు పదము లేయబడినవి.] (తుమ్మెద పదాలు మున్నగునవి భక్తిశృంగారభరితములు. భారత కథాంశము లందు వర్ణితములు.)

12. చరిత్రాంశము :

(అచ్యుతదేవరాయలు తోడిఅల్లుడైన చెవ్వప్పనాయకునికి తంజావూరు రాజ్యమునరణముగా నొసగెను....తిరుమలాంబ అచ్యుతరాయలకు పట్టమహిషి కాదు. పరిగృహీతయైన శూద్రకాంత. ఆమె మరది చెవ్వప్ప శూద్రుడు. అందు కుదాహరణము తిరుమలాంబ 'వరదాంబికా పరిణయము'.

13. ఏనాదులు :

[ఇందు ఏనాదుల ఆచార వ్యవహారములు, భాషా విశేషములు వివరింపబడినవి] (ఏనాదులలో పురుషుడు తప్పు చేసినచో స్త్రీ అతవిని విడనాడును. ఏనాదుల భాష తెలుగు. తురకము కలియదు. సంస్కృతము చేరదు. భాషా పరిశోధకులకు వీరి భాష కొన్ని రహస్యములు తెలుపును).

14. లక్షణ గ్రంథములు ;

[తెలుగు లక్షణ గ్రంథముల స్వరూపమును దిఙ్మాత్రముగా ప్రదర్శించు వ్యాసమిది. అప్పకవీయమువంటి లక్షణ గ్రంథములు ప్రాచీన గ్రంథములకు సంగ్రహములేకాని స్వతంత్రములు కావని శాస్త్రిగారు తెలిపినారు ]

15. మధుర గీతములు :

(పామరుని నోటినుండి కూడ భావామృతము పొర్లి పదబద్ధమై వచ్చినపుడు వ్యాకరణము తప్పినను, ఛందస్సు తప్పదు )

16. గ్రామ్య మీమాంస :

"మారడము భాషకు సహజ గుణము, ఆపితే ఆగే స్వభావము భాషకు లేదు'' అని శాస్త్రిగా రభిప్రాయపడినారు.

17. మధుర రచనలు :

లంకాయాగము, గంగా వివాహము మొదలగు పాటలు సమగ్రములు. వానిలోని పదాలు నిఘంటువుల కెక్క జాలినవి. క్షేత్రయ్య పదములలోని భాష గ్రామ్యముకాదు. జానపదుల రచనములను ఆదరించినచో ప్రౌఢ గ్రంథములకు ప్రచారము తగునను వాదన సరికాదు.)

18. రాజులు–కవితలు :

(జాంబవతీ కళ్యాణము కృష్ణరాయలు రచించ లేదనియు, ఎవరో వైష్ణవ కవిరచించి యుండవచ్చుననియు, ఆముక్తమాల్యద రాయలు రచించినదిగా ఏ లక్షణ గ్రంథ కర్తయు పేర్కొన లేదనియు శాస్త్రిగారు వ్రాసినారు.)

19. ప్రబంధ రత్నాకరము :

[పెద్దపాటి జగన్నాథ కవి కూర్చిన ఈ సంకలన గ్రంథము చారిత్రక పరిశోధకుల కెంతో ఉపకరించునని శాస్త్రిగారు వ్రాసినారు.]

20. నాడీ గ్రంథములు :

[ఇవి జీవిత కాలమెల్ల వ్రాసినను పూర్తికానటువంటి గ్రంథములని చెప్పుచు "అగస్త్య నాడి" అను గ్రంథమును గూర్చి ప్రభాకరులు అనేకాంశ ములు తెలిపినారు.]

21. ఆంధ్ర కవుల చరిత్ర – నన్నయభట్టు :

22. ప్రభావతీ ప్రద్యుమ్న వ్యాఖ్యా విమర్శనము :

పురాణ పండమల్లయ్య శాస్త్రిగారు ప్రభావతీ ప్రద్యుమ్నమునకు వ్యాఖ్య వ్రాసిరి. అయితే వారు వ్రాసిన టీకా తాత్పర్యాదులు కొన్ని సరసముగా లేవని శాస్త్రిగారు ప్రమాణపూర్వకముగా ఈ వ్యాసములందు విమర్శించినారు.

23. వాడుకభాష లేఖ :

[శాస్త్రిగారు గిడుగు రామమూర్తిపంతులుగారికి వ్యావహారికభాష సంప్రదాయసిద్ధమై వచన రచనలందు కనిపించునని, పండితులు వానిని పూర్తిగా మార్చి

వేసినారని తెలుపుచు లేఖ వ్రాసినారు.] (వాడుక భాషలో గ్రంథాలు వందలు వందలున్నవి.....వ్యాఖ్యానాలకు వాడుకభాషతప్ప వేరే భాష లేనేలేదు. తాళ్లపాక తిరువేంగళనాథుడు అమరవ్యాఖ్య వాడుక భాషలో వ్రాసినాడు....ప్రాచీన వచన గ్రంథాలు...పరిశీలింపగా కావ్యభాషవి వేళ్ళలెక్కకైనా రాలేదు....లక్షణ గ్రంథాలలో వచన భాగమంతా వాడుక భాషే. బ్రౌనుదొరగారు పండితులచే వ్రాయించిన వ్యాఖ్యానములన్నీ వాడుకభాషే....యక్షగానాల భాష చాలావరకు వాడుక భాషే. గొప్పగొప్ప కవులు వ్రాసినవి ఉన్నవి.)

24. శివతత్త్వసారము :

(శివతత్త్వసారములో అద్వైతాది మతాంతరఖండనము, శైవమతోత్కర్షము మొదలగు విషయములు చెప్పబడినవి )

25. శంకర విజయగాథ : [కర్తృత్వ విషయము చర్చింపబడినది.]

(వ్యాసాచల ప్రణీతమగు శంకరవిజయ మందలి శ్లోకములు కానవచ్చుటచే శంకరవిజయ గాథాకర్త విద్యారణ్యులనుట పొసగని పని )

26. కృష్ణరాయడు — పెద్దన :

ప్రపంచ దర్పణమున 'సత్యవధూ పరిణయ' మను కావ్యమును పెద్దన రచించినట్లుగా వ్రాయబడినది.

27. శ్రీకాకుళ క్షేత్రము :

[ప్రాచీనకాలమున ఆంధ్రరాజులకు శ్రీకాకుళము రాజధానిగా లేదని శాస్త్రిగారు అనేకోదాహరణములిచ్చినారు. శ్రీకాకుళమునగల సుమారు 30 శిలాశాసనములందును ఆ నగరము రాజధానిగా కనిపించదని తెలిపినారు శ్రీకాకుళ క్షేత్రమును ప్రశంసించిన కావ్యములను పేర్కొనినారు.]

28 సారంగధరుని కథ :

[రాజరాజనరేంద్రునకు, సారంగధరునకు నెట్టి సంబంధము లేదనియు, నన్నయ ఆంధ్రశబ్ద చింతామణిని బాలసరస్వతికిచ్చినట్లు అప్పకవి చెప్పిన విషయము యథార్థము కాదనియు శాస్త్రిగారు వివరించినారు.]

29. బ్రహ్మశ్రీ నడిమింటి మంగళేశ్వర శాస్త్రిలు :

[బాలరక్తై 'సమాస కుసుమావళి'ని రచించిన మంగళేశ్వరుని హాస చతురతను తెలుపు సందర్భములు వివరింపబడినవి.]

30. ప్రాచీన సంస్కృత రూపకములు :

[వరరుచి, శూద్రకుడు, ఈశ్వరదత్తుడు, శ్యామిలకుడు వీరు రచించిన భాణము (రూపకము) లను మానవల్లి చక్కగా పరిష్కరించి ప్రచురించినారని శాస్త్రిగారు వ్రాసినారు.]

31. జాయప సేనాని :

(కాకతీయ గణపతి చక్రవర్తి ఆస్థానము నందుండి నృత్తరత్నావళి రచించెను)

32. విద్యానాథుడు :

(విద్యానాథుడు ప్రతాపరుద్ర యశోభూషణమును రచించిన తరువాత భామహదండ్యాదుల ఆలంకారిక గ్రంథములకు ప్రచారము తగ్గినది)

అగస్త్యుడు : (విద్యానాథుడే అగస్త్యుడనుట కాధారములున్నవి. బాల భారతమతని కావ్యము. 74 కావ్యములనితడు రచించినట్లు గంగాదేవి మధురా విజయమున పేర్కొన్నది)

33. విశ్వనాథ కవి :

(సౌగంధికాపహరణమను వ్యాయోగ మితని రచనము)

నరసింహ కవి : (ఇతడు కాదంబరీ నాటకమును రచించినాడు. ఈ నాటకము రసవంతమైనది. పెదకోమటి వేమభూపాలుడు తన సాహిత్య చింతామణిలో ఆ నాటకము నుండి కొన్ని శ్లోకములు లక్ష్యములుగా గ్రహించినాడు)

34. చెన్నుభట్టు :

(ఇతడు తర్క శాస్త్రములోని 'తర్కభాష',అను ప్రకరణమునకు 'చెన్నుభట్టీయ' మను పేరుతో వ్యాఖ్యాన గ్రంథము రచించినాడు. రామ సౌందర్య

లహరీ స్తోత్రమునకు టీక వ్రాసినాడు. హరిహరరాయల ఆస్థానమందున్న వాడు.)

విశ్వేశ్వర కవి చంద్రుడు! (సౌరసార్ణవ సుధాకరము నందు ఇతడు బహుగ్రంథకర్తగా పేర్కొనబడినాడు. 'చమత్కార చంద్రిక', నితడే రచించి నాడు. ''శృంగార శ్రీనాథమున'' *ఇతని ప్రసక్తి ఉన్నది.

35. పశుపతి నాగనాథుడు :

[ఇతడు రచించిన గ్రంథములు పేర్కొన బడినవి]

గౌరన : [హరిశ్చంద్ర చరిత్ర, నవనాథ చరిత్రలను తెలుగులో రచించిన గౌరన పేర గల లక్షణ దీపికయను గ్రంథమును గురించి వ్రాయబడినది]

36. రెడ్డిరాజుల ప్రశంస :

[పరిపాలనాదక్షులై, బహుకావ్య నిర్మాతలై యలరిన రెడ్డిరాజులను శాస్త్రిగారు కీర్తించినారు]

37. సి.పి. బ్రౌన్ దొరగారు.

[బ్రౌను భాషా పరిజ్ఞానము, గ్రంథ సంపాదనము, పండిత పోషణము, అపూర్వ గ్రంథములు కొనుటకు చేత పైస లేనప్పుడు తన వెండి పాత్ర నమ్మి నట్టి విషయము ఇందు చెప్పబడినది.]

38. నాటక కళ :

[లలిత కళలలో నాటకమునకు గల స్థానమును శాస్త్రిగారు నిరూపించి నారు. నాటక రచనా విషయమున రచయితలు గుర్తించ వలసిన అంశములను సూచించినారు.

---

* శ్రీ ప్రభాకర శాస్త్రి గ్రంథము.

39. ద్విపద భారతము :

[ద్విపదలో రచింపబడిన రామాయణ భారతములను గూర్చి వివరింప బడినది. తిమ్మయకవి ద్విపద భారతము ప్రశస్తమైన రచనయని ప్రభాకరులు తెలిపినారు].

40 రెడ్డిరాజుల చరిత్ర :

(మెంకజీ సేకరించిన శిలాతామ్రశాసనములు మదరాసు లైబ్రరీలో ఉన్నట్లు అందు రెడ్డిరాజుల చరిత్ర సంబంధమైన విషయములున్నట్లు శాస్త్రిగారు వ్రాసినారు. మంచాళ తామ్రశాసనమును రెండు సంచికలలో ప్రకటించినారు.)

41. కొండవీడు కైఫీయతు ;

(1) కొండవీటి రెడ్డిరాజుల పరిపాలనా ప్రాభవములు ప్రస్తుతింపబడినవి. (2) గజపతుల చరిత్ర కూడా తెలియనగును.

42. వేమన కాలము :

(వేమన 17వ శతాబ్ద పూర్వార్థమువాడని శాస్త్రిగారు సవిమర్శముగా నిర్ణయము చేసినారు).

43. నారాయణ తీర్థులు :

(నారాయణ తీర్థులాంధ్రులనియు సంస్కృతమున హరిభక్తి సుధోదయమను కావ్యమును, తెలుగున పారిజాత కథ అను యక్షగానమును రచించినట్లు వివరించబడినది )

44. వినోద విమర్శము :

(ఇందు గసడదవాదేశ విచారము, స్నాన శబ్దవిచారము అను రెండు భాగములున్నవి.)

45. శివయోగ సారము : అవతరణి

(గణపతిదేవకవిరచించిన శివయోగ సారము—అవతరణికలోని విశేషములు వెల్లడింపబడినవి.)

46. వినోద విమర్శనము :

(స్నాన శబ్దవిచారము చేయబడినది.)

47. ఇక్ష్వాకులు :

(పురాణోక్తి ప్రకారము ఇక్ష్వాకులు ఇప్పటికి 3500 ఏడ్ల నాటి వారను చున్నారు. జగ్గయపేట వద్ద లభించిన బౌద్ధస్థూపముల ఆధారముగా వారు క్రీ. శ. 3వ శతాబ్దమున పరిపాలన చేసినట్లూహింప వచ్చును. ధర్మామృతమను జైన గ్రంథమున ఇక్ష్వాకుల రాజైన ధనదుని ప్రసక్తి ఉన్నది. చోళరాజులే ఇక్ష్వాకులని శాసనములు చెప్పుచున్నవి.)

48. పునర్విమర్శనములు :

(వేదం వేంకట్రాయ శాస్త్రిగారు విజయ విలాసములోని నేపాళ చోళగ శబ్దములకు సరిగా టీక వ్రాయలేదని తాపీధర్మారావుగారు గేలిచేసినారు. ప్రతిభా వంతులైన వేదం వారిని గేలిసేయుట సరిగాదనియు, తాను చరిత్ర తెలిసి వ్రాసిన బాగుండుననియు ధర్మారావుగారి విమర్శను శాస్త్రిగారు విమర్శించినారు.)

49. వినోద విమర్శము :

(తిక్కన భారతములోని 'పగయడగించుటెంతయు....' అను పద్యమునకు సరియైన పాఠనిర్ణయము చేసి అర్థము నొసగుట జరిగినది.)

50. అనంతవరతామ్ర శాసనము.

(ప్రతాప రుద్రగజపతి వేయించిన శాసనమిది. వరాహస్వామి చిహ్నముతో శాసనము మొదలగును. ఈ శాసనము అనేక చరిత్రాంశములకు నెలవైనది. ఇది క్రీ॥ శ॥ 15వ శతాబ్దము నాటిది.)

51. విమర్శ విమర్శము :

(వేదం వారి టీక సరిగా లేదనియు తాపీ ధర్మారావుగారు "ఉప్పునైనద్దీ చక్కెర ఎప్పలీడె" వంటి వాని అర్థములనెత్తి చూపినారు. కాని ధర్మారావు గారిచ్చిన అర్థములను సరిగా లేవని శాస్త్రిగారు నిరూపించినారు.)

52. ప్రాచీనాంధ్ర శాసనము :

(మూడక్షరములు గల 'నాగబు' అను తొలి తెలుగు శాసనమును గూర్చియు, ప్రాచీనాంధ్ర శాసనములలో ప్రముఖమైన లక్ష్మీపుర శాసనమును గూర్చియు శాస్త్రిగారు వ్రాసినారు.)

53. అహదనకర తామ్రశాసనము :

(అవతరణిక, శాసనస్థితి, మూలము, సమన్వయము, పదపదార్థ నిర్ణయము అను భాగములుగా ఈ వ్యాసము విభజింపబడినది. శాసనమును శాస్త్రిగారు చదివినతీరు, అర్థ నిర్ణయము చేసినవిధము ఆశ్చర్యము గొల్పును.)

54. అహదనకర శాసనము :

(పునర్విమర్శనము)

[నేలటూరి వెంకటరమణయ్యగారు, మల్లంపల్లివారు చూపిన ప్రమాదములు ప్రమాదములే కావని శాస్త్రిగారి పునర్విమర్శనమును రచించిరి.]

55. ఛార్లెస్ ఫిలిప్ బ్రౌనుదొరగారు :

[బ్రౌనుకు సంబంధించిన జాబులు, గ్రంథముల విషయమున విద్వద్గోష్ఠులలో నడిచిన కథలను 'బ్రౌనుచరిత్రము' అను పేరుతో సంకలనము చేయదలచినట్లు, ఫోటో లభించినచో ఎవరైనను పంపవలెననియు వ్రాసినారు.]

56. ఏకమూరు శాసనము :

[1445 ప్రాంతమున తిప్ప భూపాలుడు (పెదకోమటి వేమారెడ్డి సోదరుని కుమారుడు) ఈ శాసనమును వేయించినట్లు చెప్పబడినది.]

57. షష్ఠీ సమాసము :

[చిన్నయసూరి సంధిపరిచ్ఛేదములోని 34వ సూత్రమునకు సంబంధించిన విషయమిది. న్యాగము వచ్చినప్పుడు సూరి సూత్ర ప్రకారము సంధి జరుగదు. కాని దానంతట, తనంతట, వంటి రూపము లందుకు భిన్నముగా నున్నట్లు శాస్త్రిగారు వివరించినారు.]

58. తెలుగు పలుకుబళ్లు :

[చమత్కారములైన పలుకు గుర్తులను శాస్త్రిగారు ప్రకటించినారు]

59. యక్షగానము :

[దేశి నాటకములే యక్షగానము అనియు, ద్రావిడభాషలలో తొలుత వెలసిన దృశ్య రచనలు కురవంజు లనియు, యక్షగానములలో దేశి ఛందో గేయ రచన లధికమనియు శాస్త్రిగారు వివరించినారు.]

60. శ్రీనాథుని కాశీఖండము :

[కాశీఖండ ముద్రిత ప్రతిలోని అపపాఠములను సంస్కరించు దృష్టితో శాస్త్రిగారి వ్యాసమును వ్రాసినారు.]

61 శ్రీనాథుని కాశీఖండము (ఒక్కముక్క) :

[కాశీ ఖండములోని 'సృష్టి కర్తైఱ' అను పదమునకు శాస్త్రిగారు మూడు రోజులవస్థపడి "సృష్టి కన్దైఱ" అను రూపమును సాధించినట్లు వ్రాసినారు.]

62. నన్నయకు పూర్వము ఆంధ్ర భాష :

[ఆంధ్రము, తెనుగు అను పదము లెట్లేర్పడినవో వివరించి అవి జాతికి, దేశమునకు, భాషకు పేర్లెట్లయినవో తెలిపినారు.]

63. చాటువులు :

[ద్రావిడాంధ్ర భాషలలో చమత్కృతికై కల్పింపబడిన 10 పద్యాలీ వ్యాసమున గ్రహింపబడినవి. మళయాళములో కవితారచనలెల్ల మణిప్రవాళ భాషాత్మకములైనట్లు శాస్త్రీగారు తెలిపినారు]

64. సాహిత్యం :

["సాహిత్యము అన్నితరగతులవారికి అనుభవింపదగినదిగా నుండవలె" ననుట శాస్త్రిగారి నిశ్చితాభిప్రాయము. పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథల ప్రచురణలగురించి ఆశించినారు. గోన గన్నారెడ్డి కథలోని చరిత్రాంశములను చూపినారు ]

65. క్షేత్రయ అక్షరాక్షరమును పరమప్రమాణమే :

"క్షేత్రయ ప్రామాణికుడైన సత్కవి కాకపోతే ఆంధ్రమునకు సత్కవి యుండడు. క్షేత్రయ రచనలు అక్షరాక్షరమును ప్రమాణమే" అని శాస్త్రిగారు వచించిరి.

66. టుమ్రీలు :

[నంది తిమ్మన, తెనాలి రామకృష్ణుల మధ్య జరిగిన ఒక సంఘటన వివరింపబడినది]

67. గాలి కబుర్లు :

[సామాన్యముగా ఇతరులను నిందించుట కుపయోగించు మాటల నీ వ్యాస మున 500 దాకా గ్రహించినారు. జనవ్యవహారములోనున్న నానుడ్లు, సామెతలు, పలుకుబడ్లు గ్రహించి అనేక వర్గములుగా విభజించినారు. అందులో నిందా వర్గ మొకటి. ఉదా : కళ్లాయికోరు, గయ్యాళిగంప.]

68. ఏల పాటలు :

[ఏలలు శృంగార హాస్యభరితము లనియు, ఊయేలలు, జోలలు ఏలల భేదములనియు, మతంగుని బృహద్దేశిలో తెలుగు వారి ఏలలు పేర్కొనబడిన వనియు శాస్త్రిగారు తెలిపినారు.]

69. కాటమరాజు కథ :

[ఈ మూడు వ్యాసములలోను కాటమరాజు కథను శాస్త్రిగారు చక్కగా వర్ణించినారు. నాల్గవ వ్యాసమునందు రాయబార గేయము గ్రహింపబడినది. కాని ఆ వ్యాసము ప్రచురించినట్లు కనిపించదు.]

70. మట్లకుమార అనంతరాజు :

[అనంతరాజు దానధర్మములు, యుద్ధవిజయములు తెలుపబడినవి]

71. ఉపలబ్ధ, అముద్రిత ప్రాచీనాంధ్ర గ్రంథములు:

[వస్తుగౌరవమునను, కవితాగౌరవమునను సాటిలేని మేటి గ్రంథము లెన్నియో తాళపత్రములందున్నవని శాస్త్రిగారు వ్రాసినారు. అట్టివానిని 116 సూచించినారు.]

72. ఆంధ్రదేశపు జానపద గీతాలు :

[ఈవ్యాసమున బిచ్చగాండ్ర పాటలు, పిల్లల పాటలు, ఆల్లోనేరళ్ల పాటలు, లాలిపాటలు, కూనలమ్మ పదాలు గ్రహింపబడినవి.]

73. నేటి తెలుగు—నోటి తెలుగు :

[ఆంధ్రపత్రిక సంపాదకులు శంభుప్రసాద్‌గారి (24-1-'48) కోరికపై శాస్త్రిగారీ వ్యాసమును రచించినారు. ''మాట్లాడే భాషకు, వ్రాసే భాషకు ఐక్యముండవలె'' నని సూచించినారు. ''ఇటువంటి భాషను ఈవిధంగానే వాడవలసిందని శాసించడం ఎవరికీ తరంకాదు'' అని శాస్త్రిగారు తెలిపినారు.]

74. తాళపత్ర గ్రంథాలు :

[తాళపత్ర గ్రంథములను రక్షించుకొనవలసిన బాధ్యత మనపై ఉన్నదని శాస్త్రిగారు వివరించినారు.]

75. భాషావికాసము ;

[పరిణామశీలమైన సంఘముతోపాటు భాష మార్పుచెందుట సహజమనియు, అన్యభాషా పదజాలముతో మన భావలను పరిపుష్టము చేసికొనవలెననియు తెలుపుచు తెలుగు పలుకుబడికి, ఇంగ్లీషు పలుకుబడికి గల తారతమ్యములను సూచించినారు.]

76. దేశి సాహితి సొంపు :

[దేశి రచనలు ఆంధ్రజాతి ఆచార వ్యవహారములలో అంతర్లీనమైయున్నవని ఉదాహరణ పురస్సరముగా శాస్త్రిగారు నిరూపించినారు.]

77. కట్టుకథలు :

[ఇందు ఉపనిషత్తులలోని కథలకు, జానపద గాథలకు గల పోలికలు చూపబడినవి.]

78. సజీవ రచన :

[సజీవ రచన సత్పురుషుని వంటిదనియు, పరమార్థాభిముఖముగా సాగనిది సద్రచన కానేరదనియు శాస్త్రిగారు వివరించినారు. స్వతంత్రమైన జాతిలోనే సజీవ రచనలు పుట్టి జాతికి విశిష్టత కూర్చునని తెలిపినారు.]

79. కళింగ దేశము :

[తాళపత్ర గ్రంథ సంపాదనకై విశాఖపట్టణము గంజాము మండలములలో సంచరించునపుడు ఎదురైన సంఘటనలు వ్రాయబడినవి.]

80. ఆస్థానకవి నిర్యాణము :

[చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి నిరాడంబరతకీ వ్యాసము అద్దముపట్టినది.]

81. జ్ఞాపకాలు :

[ఇందు శాస్త్రిగారి గతస్మృతులు పేర్కొనబడినవి. కోపముతో విద్యార్థుల ననవసరముగా కొట్టే ఉపాధ్యాయుని మనస్సును మరలించిన సంఘటన వివరింపబడినది.]

82. జ్ఞానసంపద :

[ఆరోగ్య సంపద, జ్ఞాన సంపద, ఆనంద సంపద- ఈ మూడింటికి సచ్చిదానందములని పేరనియు ఈమూడూ అన్యోన్యాశ్రయములై యున్నప్పుడే మానవుడు మహనీయుడౌతాడనియు శాస్త్రిగారు వివరించినారు, శాస్త్రిగారి జ్ఞాన తృష్ణ కీవ్యాసము దర్పణము వంటిది.]

83. *నీతిద్విషష్టిక ; ఉపోద్ఘాతము :

[ఈ కృతికి శాస్త్రిగారు ఉపోద్ఘాతమును సంస్కృతమున కూర్చిరి. డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు తెనిగించి దానిని మణిమంజరిలో ప్రకటించినారు. కృతికర్తయైన సుందర పాండ్యుని గురించి శాస్త్రిగారెన్నియో విషయములు వ్రాసినారు. ఈ సందర్భమున వారెన్నియో సంస్కృత గ్రంథము

*తెలుగులో — సురభారతి ప్రచురణము.

లను పరిశీలించినారు. 62 శ్లోకములు మాత్రమే లభించుటచే ఎవరో లేఖకుడు ''సీతిద్విషష్టికా' అని పేరుంచినట్లు శాస్త్రిగారు భావించినారు. కాని ఈ కృతి అసలు పేరు 'ఆర్యావలీ'. ఇందలి ఆర్యలు ''తేనెలో ఊరబెట్టిన అల్లపు ముక్కలవలె కటు—మధురాలుగా ఉంటాయి'' అని ప్రభాకరులు తేటపరచినారు ]

**(b) ఇతరములు :**

1\. ఎఱ్ఱగడ్డవారి పోరాటము :

[నల్లసిద్ధ దేవచోళ మహారాజుకు, కాటమరాజుకు పుల్లరి విషయమై ఏర్పడిన తగవు ఈ వ్యాసమున వర్ణింపబడినది.]

2\. కృష్ణ వరదలు—ఘోరవిపత్తు :

[కృష్ణానది పొంగినపుడు కల్లేపల్లి (ప్రభాకరులు పుట్టిన గ్రామము) మున్నగు గ్రామములు జలమయములైనవి. ఆ దుస్థితిని శాస్త్రిగారు కన్నులకు కట్టినట్లు వర్ణించి తమ కవితామయమైన హృదయమును చాటుకొన్నారు.]

3\. పెద్దకల్లేపల్లి వృత్తాంతము :

[కృష్ణ వరదలకు కల్లేపల్లి జనులుపడిన అవస్థలు, జమీందారుల కఱకుదనము ఇందు వర్ణితములు. శాస్త్రిగారి సామాజిక స్పృహ కీ వ్యాసము మచ్చుతునక.]

4\. కృష్ణరాయల పత్నులు :

[రాయలకు చిన్నాదేవి, తిరుమలదేవి అను వారలే కాక భద్రదుసు నామెయు పత్నియైనట్లు ప్రబోధ చంద్రోదయ వ్యాఖ్య తెలుపుచున్నదని శాస్త్రిగారు తెలిపినారు.]

5\. తంజావూరి రాజుల విగ్రహములు :

[కుంభకోణములో 'రామస్వామి' ఆలయమున రఘునాథ నాయకునకు సంబంధించిన విగ్రహాలున్నట్లు కనుగొన్నారు.]

6 ప్రాచీన వస్త్ర పరిశ్రమ :

[11 వందల ఏండ్ల నాటి చాళుక్య సోమేశ్వరుని మానసోల్లాసమను గ్రంథమున రకరకాల అద్దకముల పేర్లున్నట్లు శాస్త్రిగారు వివరించినారు.]

7. వృక్షాయుర్వేదము :

['వృక్షాయుర్వేదము' అను తాళపత్ర గ్రంథమును శాస్త్రిగారే మొదట కనుగొనిరి. అందలి విషయములను వివరించిరి.]

8. సుభోజనము :

[సంస్కృతమున సుభోజనమును గూర్చి వ్రాయబడిన శ్లోకములు ఆంధ్రదేశపు భోజన రీతినే ప్రశంసించుచున్నవి. శంకరాచార్యుల పూజా స్తోత్రములను ఆంధ్రదేశపు భోజన పదార్థములే నైవేద్యములుగా పేర్కొనబడినవి.]

9. జయంతి కామేశము పంతులుగారు :

[పంతులుగారి ఉదారగుణమును వ్యక్తముచేయు సంఘటనలు వర్ణింపబడినవి ]

10. పాటలీ పుష్పము :

[వైద్యశాస్త్రమున 'పాటలీ' పుష్పమునకు గల ప్రాధాన్యతను శాస్త్రిగారు వివరించినారు.] (పాటలిని తెలుగులో పొదిరి లేక కరిగొట్టు అందురు. ఇది పుష్పించునేగాని ఫలించదు. కృష్ణాతీరమున దప్ప ఆంధ్రదేశమున మరెచ్చటను లేదు. బిందెడు చల్లని మంచినీటిలో నాల్గు పువ్వులు వేసికొంటే ఆ నీరంతా సుగంధ భరిత మౌతుంది.)

11. పూర్వకాలపు పల్లెటూళ్ళు :

[శాస్త్రిగారు పల్లెప్రజల వృత్తులను, మనః ప్రవృత్తులను, ఆచార వ్యవహారములను చక్కగా వివరించినారు ]

12. ఈశ్వర కరుణామృతము :

[తీవ్రానారోగ్యముచే పెక్కు మాసములుగా బాధపడిన దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు భగవత్ప్రార్థనా నంతరము అనుభవించిన సుఖాను భూతి యిందు వర్ణితము.]

13. హైదరు చరిత్ర :

[మెకంజీ సేకరించిన రికార్డులు, కైఫియతులు మున్నగు వానినుండి శాస్త్రి గారి పర్యవేక్షణలో సేకరించిన అంశములు ఆంధ్రపత్రికలో ప్రచురింపబడినవి. "హైదరు చరిత్ర" అను పేరుతో నాల్గు వ్యాసములు ఆంధ్రపత్రికలో అచ్చయి నవి. ఇందు సుల్తాను ఆగడములు, హైందవుల కడగండ్లు సవిస్తరముగా వర్ణింప బడినవి.]

14. తలటోపీ తురుష్కుల నుంచి వచ్చిందా ?

[తలటోపి తురుష్కుల నుంచి రాలేదని శాస్త్రిగారు నిరూపించినారు. ఈ వ్యాసమున 'శోహసనము' గురించి, 'కర్మరి' గురించి, ప్రాచీన రాజ ప్రసాదముల నామములను గురించి చక్కగా వివరింపబడినది.]

15. ఆమె పరమ ప్రాప్యము గాంధిగారి అంతరాత్మయే :

[విశ్వమున ఈనాడు మరణమును గూర్చి నిర్భయముగా, విశ్వాసముగా నిలువబడగిన స్త్రీ కస్తూరిబాకంటె మించినయామె ఉండదు అని శాస్త్రిగారు తెలిపి నారు. ఈ వ్యాసము కస్తూరిబా దివంగతురాలైన సందర్భమున వ్రాయబడినది.]

16. బొబ్బిలి జాబు :

[కృష్ణారెడ్డి యను వ్యక్తి కడప నుండి బొబ్బిలికు వ్రాసిన జాబులోని విషయములు ప్రకటింపబడినవి.]

17. ఉదయగిరి జాగీరుదారు చరిత్ర :

[1840 ప్రాంతములో ఈ జాగీర్‌దారు దుశ్చర్యలను ప్రభుత్వమునకు తెలిపి హమీరుద్దీన్ అనునతడు ప్రశంసలు పొందినట్లు వ్రాయబడినది.]

18. భుక్తి పత్రి :

[తిరుపతికొండమీది గోగర్భక్షేత్రమునగల చెట్లకు 'భుక్తిపత్రి' అని పేరు పెట్టి మొట్టమొదట శాస్త్రజ్ఞుల దృష్టికి తెచ్చిన వారు శాస్త్రిగారే. ఈచెట్టు దోసె డాకుఁతో కడుపు నిండుననియు, యోగులుపయోగింతురనియు పరిభాకరులు వివరించినారు.]

19. బౌద్ధిను దొరనాటి దయ్యాల వృత్తాంతము :

[లోకములో భయపడెడివారికి మాత్రమే దయ్యాలగుపించు ననెడి నీతిని ఒక సంఘటన ద్వారా నిరూపింపబడినది.]

20. ముఖస్తుతికి ఏవగింపు :

[బౌద్ధిను తత్వము ముఖస్తుతులకు లొంగునట్టిది కాదను విషయము వివ రింపబడినది.]

21. రైతుల కష్టాలు – కన్యకా విక్రయం :

[కైఫీయతుల నుండి వెలికి తీసిన నిత్యనవీనములైన అంశములలో ఇదొక అంశము.]

22. వేంచేసినారు :

[రాయలకడకు వెళ్ళిన తాతాచార్యుల రాకకై అతని భార్య ఎదురుతెన్నులు చూడసాగినది. చివరకు తాతాచార్యులు తిరిగివచ్చుచున్న సంగతికి శిష్యులు ఆమె కడకు వచ్చి 'ఆచార్యులవారు వేంచేసినారు' అని చెప్పిరట. ఆమె వెంటనే తన భర్త దివంగతులైనారని భావించి ప్రాణములను విడిచినదట. ఈ కథ లోకల్ రికార్డులనుండి గ్రహింపబడినది.]

23. పుష్పగిరి క్షేత్ర యాత్ర వృత్తాంతము :

[రాయలు పుష్పగిరిని సందర్శించి తంబలవారిని శిక్షించి బ్రాహ్మణాగ్ర హారమును నిర్మింపజేసినట్లు కైఫీయతులో ఉన్నది. ఇందులోని విషయములు ప్రామాణికములు కావని శాస్త్రిగారు తెలిపినారు.]

24. దళవాయి సాంబయ్య :

[బ్రాహ్మణుడైన సాంబయ్య మైసూరు రాజుతో యుద్ధముచేసి విజయము సాధించినట్లు నిరూపించబడినది.]

25. ఆనంద గజపతి బాల్యంలో :

[ఏ విషయమైనను ఆనంద గజపతి ఆమూలాగ్రముగా అర్థము చేసికొని నిశ్చలమైన సిద్ధాంతమునకు వచ్చెడివారని శాస్త్రిగారు ఒకటి రెండు సంఘటనల ద్వారమున వెల్లడించినారు.]

26. సామాన్య వనితా శాపం :

[లోకల్ రికార్డుల నుండి గ్రహింపబడిన విషయ మిందలిది.]

27. కాకతి గణపతిరాజు ఘనత :

[తిక్కనామాత్యుని కోరికపై మనుమసిద్ధికి పోయిన రాజ్యమును తిరిగి ఇప్పించిన గణపతి దేవుని ఘనత యిందు వర్ణింప బడినది.]

28. వేంకటపతి రాయలు :

[చంద్రగిరిని పాలించిన వేంకటపతిరాయలకు కల్గిన విజయ మీ వ్యాస మున వివరింపబడినది.]

29. ప్రార్థనము :

[తనలో నేదేని విశేషమున్నచో అది ప్రార్థనా మూలమువనే సిద్ధించి నట్లు గాంధీజి చాటి చెప్పిన విషయమిందు గ్రహింపబడినది.]

30. భవభూతి అడుగుజాడలో బాపూజీ :

[ఈ వ్యాసము నవ్యసాహిత్య పరిషత్తు 11 వ వార్షికోత్సవమునాడు ప్రభాకరశాస్త్రిగారు చేసిన ఉపక్రమోపన్యాసము నుండి గ్రహింపబడినది.]

31. దేశావృతమైన దుర్భిక్ష మహాక్షోభం :-

[రెండవ ప్రపంచ యుద్ధము ముగిసిన రోజులవి. భారత దేశమున దుర్భిక్ష మేర్పడినది శాస్త్రిగారి హృదయము తల్లడిల్లినది. కరువు నివారణో పాయములను ప్రజలకు సూచించినారు.]

32. 'సర్వకాలాలకూ, సమస్తమానవజాతికీ బాపూజీ సందేశం-శిరోధార్యం'

[గాంధీజీ తుపాకి గుండు కెరయైనాడన్నవార్త శాస్త్రిగారి మనస్సును ఎంతో కలచివేసినది, "గాంధీజీ బ్రాహ్మణుని చేతిలో సంహరింపబడెనన్నచో బ్రాహ్మణజాతి కిరాతక జాతికంటెను అధఃపతితమైనట్లైనది. పూజ్యతా చిహ్న మనుకొనే జందెం నింద్యతా చిహ్నంగా అవమానం కల్గిస్తుంది" అన్న వేటూరివారి హృదయమెంత సంస్కారపూరితమో తెలియవచ్చును. శాస్త్రిగారు గాంధీజీని శాశ్వత సారస్వత జనకునిగా పోల్చినారు].

33. స్వాతంత్ర్య దినోత్సవము :-

[మహాత్ముని మహోన్నత శీలమును అభివర్ణించు ప్రసంగ వ్యాసమిది]

34. దాక్షారము అన్న సత్రమ్ము గంట:-

[1434 ప్రాంతమున వీరభద్రారెడ్డి దక్షారామమున అన్న సత్రరువులో నుండుటకు గంటను సమర్పించిన విషయము వర్ణింపబడినది.

# వ్యాస సంపుటులు

## I తెలుగు మెఱుగులు

### 1. తెలుగుదనము : తెలుగు సంప్రదాయము

[ఈ వ్యాసమున తెలుగువారి సంప్రదాయములోని 'పైటకు'' 'తాళి'కి సం పూర్వచరిత్ర వివరింపబడినది.]

(ప్రతిష్ఠానము (పైఠాన్) నుండి తెలుగువారికి పైటలు సంక్రమించినవి. 'పైఠాన్' శబ్దభవమే పైట. తాళికట్టు ఆచారము తెలుగువారికివలె ఔత్తరాహులకు లేదు. తాటాకును చుట్టగాచుట్టి పసుపు పూసి నూలిబొంతతోకట్టి వధువు కంఠమున కట్టించుట తెలుగువారి ఆచారము. కావున అది తాళిబొట్టైనది. తాళి యనగా తాడి. తాటాకు పదమే సంస్కృతమున తాటంకమైనది.

### 2. ఆంధ్రభాషావతారము

[ఇందు శాస్త్రిగారు ద్రవిడ కర్ణాట భాషల సంబంధములేని తెలుగు పదములనేకములు కలవని నుడువుచు 'నూనె' పదమెట్లేర్పడినదో చూపినారు.]

### 3. ఆంధ్ర కల్పవృక్షము

[కొబ్బరిచెట్టునో, మామిడిచెట్టునో భూలోక కల్పవృక్షమనవచ్చుగాని తాడిచెట్టు నాపేరుతో నేల పిలిచెదరను సందేహము ప్రభాకరులకు చిన్నతనముననే కలిగినది. తరువాతికాలమున వారి సందేహము తొలగినది. చక్కని వ్యాసము రూపొందినది.

(ప్రాచీన నాగరకతకు తాడిచెట్టు జీవగఱ్ఱ... జాబుకు కమ్మ అను పేరు తాటాకును బట్టి వచ్చినదే. తాడిచెట్టును వర్ణించిన వారిలో ఎఱ్ఱన, శ్రీనాథుడు ముఖ్యులు)

4 ''ప్రాచీనగ్రంథముల పలుకుబడికి మనపై చెల్లుబడి''

(నన్నయ మొదలు చిన్నయదాకా ఎన్నిక గన్న ఆంధ్రకవుల గ్రంథముల పలుకుబడి విద్యావివేకముగల ఆంధ్రప్రజల హృదయములపై విశేషముగా సాగుచున్నది. రామలక్ష్మణులు, భరతులు, సీతలు, కైకలు, ఉత్తరకుమారులు, నిగమశర్మలు మొదలగు పురాణ పురుషులు అనేకులలో గుర్తింపబడుచున్నారు. శ్రీనాథుని భీమఖండమాధారముగా ''చందమామరావే జాబిల్లిరావే'' అను పాట పుట్టినది....

బ్రౌను కొకపండితుడు తన దీనత్వమును సూచించుచు ''లావొక్కింతయులేదు'' అను భాగవత పద్యమును వ్రాసిపంపగా బ్రౌనుదొర ''ఏను మృతుండ నౌదునని యింత భయంబు మనంబులోపలన్'' అను పోతన వ్రాసిన పద్యమునే 'ఎండార్సుమెంటుగా వ్రాసి కొంతసొమ్ముతో పంపినారట.]

5. ''తెనుగు తేటదనము''

[దేశరచనలన్నియు వాడుక భాషలోనే యున్నవనియు, వాడుక భాష గ్రాంథికభాష కంటెను బహుప్రయోజనములు గల్గినదనియు శాస్త్రిగారు వివరించినారు.]

(తేట తెలుగు బాలశిక్షనుండి మోక్షవిద్య దాకా కలకలలాడుచున్నది. రాజశాసనాలు, దానశాసనాలు వాడుక భాషలోనే ఉన్నవి. వాడుక భాష అనే ముడిసరుకు నుండి సున్నితపు మేల్మిసరుకు తయారగుచుండును. చెళ్లపిళ్లవారు కోటలోజరుగు నాటకములుకాక కోటవెలుపల జరుగు వీథినాటకములను, తోలుబొమ్మలాటలను చూచి వినోదించెడివారు)

6. ''ఆంధ్రకవిత - పురాణయుగము''
(నన్నయ తిక్కనలు)

[పురాణయుగమును పురాణశకమనినచో బాగుండుననియు కావ్యేతిహాసములను పురాణములనుట సామాన్య వ్యవహారములో నున్నదనియు తెలిపినారు. పురాణకవులైన నన్నయతిక్కనల కవితా పద్ధతులను వివరించినారు]

[తిక్కన పాత్రలను తననాటివానినిగా తీర్చిదిద్దుకొనినాడు. నన్నయ శకుంతలోపాఖ్యాన రచన కావ్యాలంకారౌచితీరీతిని చూడగా గ్రామ్యతా దోష జుష్టమనదగియున్నది. వ్యాసుడే దానినట్లు రచించినాడు, నన్నయది ఋషి మార్గము. తిక్కనది రసమార్గము)

7. "ఆంధ్రకవిత – ప్రబంధ యుగము"

(నన్నయనాటి నుండి ప్రబంధరచనా వ్యాప్తి ఎట్లు జరిగినదో కూలంకష ముగా వివరింపబడినది. ప్రబంధము సర్వసమగ్రముగా రూపొందిన విధానము ఉదాహరణపురస్సరముగా విపులీకరింపబడినది. పారిజాతాపహరణ ప్రబంధము ప్రశస్తనాటక కథాకల్పనముగా తీర్చిదిద్దబడిన విధము నిరూపింపబడినది]

8. "అరసున్న"

(పదమందున్న ఒక అక్షరమునకో కొన్ని అక్షరములకో ఆదేశమై వచ్చి నది గాని నాసిక్యహల్లు ఇతర హల్లుతో సంయుక్తమైనప్పుడు ఏర్పడిన హల్ ద్విత్వము శిథిలముకాగా అందలి శిథిలానునాసికమే అరసున్నగా మారినది. ఇతర భాషలలో అరసున్న లేదు)

9. "వింత నిఘంటువులు"

[ఆలవాలము, మాఘమాసీగవామిత, అట్టహాలాజనపదాః, రఘుకులా న్వయ రత్నదీపం, వానరా, అక్రీతదాసః, వల్మీకః. గంధర్వనగరమ్, జీర్ణా రణ్యమ్, శమీపత్రం, ప్రసన్నవదనం, సుందరకాండ, మదిరాక్షి మున్నగు పదములకు వింత నిఘంటువులచే అర్థనిర్ణయము చేసిచూపబడినది.]

10 "గ్రంథగ్రంథులు"

[ఆంధ్ర గ్రంథములందు ముడులు విడని గ్రంథగ్రంథులుగా కొన్ని పద్యములున్నవి. అట్టివానిలో చందమామ ఘటిక, కేనము, కనుమారి, టాటాలు, గుణించుట, అధ్యానము, కనకస్వామి, ఉప్పుతో తొమ్మిది, కోహళి, ఇట్టిక సూడినవాడు అను పదములకును, మనుచరిత్రలోని అనేక పదములకును శాస్త్రి గారు ఉచితార్థ నిర్ణయము చేసిచూపినారు.]

11. ''ఆవీ–ఇవీ''

[హరవిలాసము, మనుచరిత్ర మొదలగు గ్రంథములలోని అనేక పద్యములకు పాఠభేదములు చూపబడినవి. అర్థములు వివరింపబడినవి. చెరపు, చిగురుఁగొమ్మ, ఆనందోబ్రహ్మ, తేడు, బెడఁగు, గోహరి, ఇత్యాదులు.]

12 ''తెలుగున ప్రథమావిభక్తి 'ఁడు' ఎట్లు పుట్టినది ?''

[తెలుగు పదములు సామాన్యముగా ప్రథమావిభక్తి బహువచన రూపములను ముందు పొంది తరువాత ఏకవచనరూపములు పొందునట్టి విధానమును శాస్త్రిగారు దృష్టాంత పూర్వకముగా చూపినారు.]

(అజవము తరువాత పుట్టిన తెనుగునకాభాషలోని ప్రథమా విభక్తనంత పదములే ప్రాతిపదికలైనవి. ప్రాచీన శాసనములలో, అవణ్ణు, మగణ్ణు, రామణ్ణు అను రూపము లున్నవి. అవి క్రమముగా అవణ్ణు, మగణ్ణు, రామణ్ణు అను రూపములైనవి. తరువాత వాడు (అవణ్ణు>వాడు) మగడు రాముడుగా మారినవి.)

13. ''ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణము''

[శాస్త్రిగారు తమకు లభించిన ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోని సంకీర్ణ పద్య తాళపత్ర సంపుటములోనుండి ఏ రామాయణమునను కనిపించని రామాయణ సంబంధమైన ముప్పది పద్యములను ఎఱ్ఱన రచించినవిగా సూచించినారు. భాస్కర రామాయణమునను శంభుదాసుని పద్యములుండవచ్చునని శాస్త్రిగారూహించినారు.]

14. ''కవితాపారమ్యము''

(వెంకట పార్వతీశ్వర కవుల 'ఏకాంత సేవ' రవీంద్రుని గీతాంజలి ఛాయ గలిగిన వ్యంగ్య ప్రధాన కావ్యము.... వ్యంగ్య ప్రధానమైన కావ్యమే ఉత్తమ కావ్యము. సృష్టికర్త తన సృష్టి కార్యములను కనిపించునట్లు చేయుచునే తన్ను తాను దాచుకొని కార్యములచేత మాత్రమే అనుమానింపబడినట్లు ఉత్తమ కవియు కవితాకల్పనలో పరమార్థమును గర్భితీ పరచి వ్యంగ్యగోచరము గావించును.

కల్పిత కవితలోని పరమార్థము ధ్వన్యర్థవేద్యము కానిచో ఆ కవియబద్ధాల కోరుగా మిగులును.)

15. "ఆంధ్రలిపి – సంస్కారము"

(నేడు వాడుకలో నున్న తెలుగు లిపి చిక్కులు కలిగించునదిగా నున్నది. పసిబాలురు లిపిని నేర్చుకోవలెనన్న చాల కష్టము. అచ్చొత్తించుటకు, టైపు రైటింగు నిర్మాణమునకు, వర్ణోచ్చారణ రీతికి నడ్డంకుగానున్నది. కావున లిపి సంస్కారమెంతేని యవసరము.)

## II మిగడ తఱకలు

I. సాతవాహనులు

[సాతవాహనులాంధ్రులు కారనువాదమును పి. టి. శ్రీనివాసయ్యంగారు లేవదీసిరి. కాని అది సరియైనది కాదని శాస్త్రిగారనేకోపపత్తులు చూపినారు. బండార్కర్ వంటివారు ముళకదేశమేదో చెప్పలేకపోయిరి. ముళక దేశమే 'ముల్కినాడు' (పల్నాడు) అనియు, సిరిటన్ పర్వతమే శ్రీపర్వతమనియు అనగా శ్రీశైలమనియు, ముళక దేశము సాతవాహనుల ఏలుబడిలో నుండుటచే వారు శ్రీస్థానమునకు పాలకులైరనియు ప్రభాకరులు నిరూపించినారు.]

2. శివకవులు

(శివునిమీదను, తద్భక్తులమీదను మాత్రమే కృతులు చెప్పెడి శైవులు శివకవులు. ప్రాసయతి, రెండేసి చరణములకు పదమధ్య సంధి, ప్రాసము లందు అర్ధ బిందువునకు పూర్ణ బిందువును కూర్చుట, అపూర్వ శబ్దరచనము శివకవుల రచనలందు గోచరించును. వీరశైవులు తెలుగు భాషను మతభాషగా చేసికొన నెంచినారు.)

3. పండితారాధ్య చరిత్రము

(మల్లికార్జున పండితారాధ్యుని జన్మాధిక వృత్తాంతములు, గ్రంథ రచనా విశేషములు వివరింపబడినవి.)

(శివతత్వసారమును కన్నడములోనికి పండితారాధ్యుడే రచించి యుండ వచ్చును. శివతత్వసారము వెయ్యి పద్యముల గ్రంథమై యుండనోపును.)

4. వేములవాడ భీమకవి

(భీమకవిని శ్రీనాథుడు, కూచిమంచి జగ్గన, గోపరాజు మొదలగువారు నుతించినారు. భీమకవి కళింగాధీశుడైన అనంతవర్మ చోడగంగదేవుని దర్శించి నట్లు చాటువులున్నవి. ఆంధ్ర ప్రయోగరత్నాకరమున భీమకవి పేరున 'నృసింహ పురాణము' పేర్కొనబడినది.)

5. ప్రాచీనాంధ్ర వచనకావ్యములు

(పురాణాలతో పాటు దృశ్య శ్రవ్య కావ్యములకు తెలుగనువాదములు చంపూరూపము ననుసరించినవి) [ఈ వ్యాసమున కవిత్రయము వారి పద్య రచనా విధానము, నన్నయ నుండి చిన్నయ వరకు జరిగిన వచన వాఙ్మయ వికాసము సహేతుకముగా ప్రదర్శింపబడినవి.]

6. భాగవతము

(పోతన, సింగన హరిభట్టు, ఏల్చూరి సింగన, నర్సన, కోనేరు నాథుడు, పుష్పగిరి తిమ్మకవి, తరిగొండ వేంకమాంబ మొదలగువారు రచించిన భాగవత భాగములను గూర్చి తెలుపబడినది.)

7. మధుర కవితలు

[భాష, భావము ఛందము దేశీయములై సంగీత సంస్కారము కలిగి సామాన్య జనుల నాల్కలమీద నాట్యమాడునవిగా నుండుటచే దేశిరచన లంతగా లిపికెక్కలేదనియు, యక్షగానములు మధురకవితలలో చేరుననియు శాస్త్రిగారు వివరించినారు. దేశి దృశ్యరచనలు, కురవంజులు, యక్షగానములు, ఆట భాగవతములను గూర్చి సవిమర్శకముగా చర్చించినారు. సుగ్రీవవిజయ ప్రాశస్త్యము ను తెలిపినారు.]

8. కృష్ణరాయల విద్యా గోష్ఠులు

[రాయల ఆస్థానమున అష్టదిగ్గజ కవులుండిరన్న లోకప్రతీతిని కందుకూరి వారు విశ్వసించకపోవుటను శాస్త్రిగారు వ్యతిరేకించినారు. అష్టదిగ్గజ కవులలో రుద్రకవి యొకడని నిరూపించినారు. ఆముక్తమాల్యదను పెద్దన రచించెననుటకు గల ఆధారములు చూపినారు. 'ప్రపంచదర్పణ' మను గ్రంథమును గూర్చి ముచ్చటించినారు.]

9 **ఉద్భటారాధ్య చరిత్రము**

[ఉద్భటారాధ్య చరిత్ర కర్తయైన రామలింగడే రామకృష్ణుడనుటకు గల బలవత్ప్రమాణాలు చూపబడినవి. తద్గ్రంథరచనాకాలమును గూర్చి, రామకృష్ణుని ఇతర రచనల గురించి కమనీయముగా సాగిన వ్యాసమిది.]

10. మనుచరిత్ర

["మనుచరిత్రలోని తొలి నాల్గైదాశ్వాసముల రచనను స్వారోచిస్సంభవ మనియు, అది రసవత్తర మనియు, ఆ తరువాతి రచనను స్వారోచిష సంభవ మనియు రెండు ప్రబంధములుగా నేను పేర్కొందును" అంటూ శాస్త్రిగారు ప్రవర వరూధినీ ఘట్టములోని తీరుతెన్నులను వివరించినారు.]

11. దక్షిణదేశమందలి ఆంధ్ర వాఙ్మయము

[క్రీ.శ. 1400 తరువాత తురుష్కుల ఆగడాలు ఆంధ్రదేశము నల్లకల్లోలము చేసిన తీరును వర్ణించెడి అన్నమయ్య కీర్తన చూపబడినది. రాయల తరువాత ఆంధ్ర సాహిత్య సరస్వతి అరవదేశము నాశ్రయించుటకు గల కారణములు వ్రాయబడినవి. రఘునాథ భూపాలుడు, కృష్ణాధ్వరి వంటి కవుల రచనలు పరిశీలింపబడినవి. దక్షిణాంధ్ర వాఙ్మయము సమగ్రముగా దర్పణమునందు వలె ఈ వ్యాసమున చూపించబడినది.]

12. కొలచెలమవారు

[మల్లినాథసూరి యింటిపేరు 'కొలచెలమ' అని నిరూపించుటకు శాస్త్రిగారనేకోపపత్తులను చూపినారు. మల్లినాథుని వంశములోని పండితుల రచనలను గూర్చి ఎరుకపరచినారు.]

13. త్యాగరాజు

[త్యాగరాజు నారాయణ తీర్థులవలె భక్తిలయ యోగముల ద్వారమున సంగీతరూపమగు నాద బ్రహ్మానంద రసమనుభవించిరనియు, బాహ్యమైన మూర్త్యారాధనముకంటె అధికముగా అంతర్యామ్యర్చనమే గావించిరనియు వివరించినారు. ''తరము గాని యెండవేళా కల్పతరునీడ దొరకినట్టాయె యీవేళ'' అను పదములోని అర్థము నూహించి శాస్త్రిగారు కథనల్లినారు ]

14 ఆంధ్రభాషావతారము

[శాస్త్రిగారి వ్యాసమున అమ్మ—అబ్బ—శబ్దరూప నిష్పత్తి గావించినారు. ]

15 వాఙ్మయ పరిణామము

(కావ్యాలంకార చూడామణికారునినుండి బాలవ్యాకరణకారునిదాకా గల పండితులు చేసిన నిబంధనలు పరిమిత మానవ సంఘమునకు, మితభాషా ప్రయోజనమునకు సంబంధించినవే. బ్రాహ్మణాధిక్యమును ప్రతిఘటించుటకు మాలవాడును, మహారాజు ప్రాభవమును ప్రతిఘటించుటకు దరిద్రుడును యత్నించు ఈ సంఘర్షణ మనివార్యము. సర్వమానవ సంఘము భాషాప్రయోజన సర్వస్వమును సమముగా పొందవలెను. 'వచ్చుచున్నాను' అను శబ్దమువలె 'వస్తున్నాను' అను రూపము 'ప్రాజ్ఞవ్యవహారమందున్నందున ప్రయోగార్హమే మనిషి 'నా భాషను నేను వ్రాయుదును, ఇంకొకరి నిర్బంధము నాకు విధాయకము కాదు' అన్నంతవరకు పోవచ్చును.)

# III. సింహావలోకనము

1. నన్నయకు పూర్వపు ఛందస్సు

(దేశి కవితను పుట్టించిన చాళుక్యరాజు రాజరాజనరేంద్రుడే. మధ్యాక్కరలో యుద్ధమల్లుని శాసనము; సీసము, తరువోజలతో పండరంగని రెండు శాసనములు నన్నయకు పూర్వమే రచింపబడినవి. పాండిత్య నిరపేక్షము లయిన రచనలు నన్నయకు పూర్వమున్నవి. 'ము' 'విభక్తి యతి నన్నయకు పూర్వమే ఏర్పడినది)

2. రంగనాథ రామాయణము

[రంగనాథ రామాయణము పీఠికారచనకై శాస్త్రీగారు గుర్తించి యుంచు కొన్న రచనాంశమును, చాటుపద్యమణిమంజరి (ద్వి.భా) - లో రంగనాథుని గూర్చి యుపలబ్ధాంశముల నెత్తిచూపుటకై పేర్కొన్న విశేష విషయములతో సంధానింపగా ఈ వ్యాస మీసంకలన మందు రూపుదాల్చినది]

(తండ్రి విఠ్ఠలభూపతి ప్రేరణచే బుద్ధభూపతి తదంకితముగా రామాయణమును విరచించెను..గోన వంశమువారు రెడ్లు. నిజాంరాష్ట్ర ప్రాంతమువారు. రంగనాథరామాయణ రచనాకాలము 1280-1300. బుద్ధభూపతికి రంగనాథుడను వాడు రామాయణ రచనా విషయమున తోడ్పడియుండవచ్చును. చక్రపాణి రంగన కవియే రంగనాథుడని ఊహింపవచ్చును)

3. తెలుగు కవితలోని దేసితనము

(తెల్గుకంటె కన్నడకవిత, దానికంటె అరవకవిత, దానికంటె సంస్కృత ప్రాకృత కవితయు ప్రాచీనములు.... యతి కన్నడమునలేదు. అరవమున విరళము. తెలుగుననదియొకవిశేషము. నన్నెచోడుడు దేసిబావను, దేసితలుపులను దేసివర్ణనలను, దేసికవితా పరికరములను గ్రహించినాడు. పాల్కురికి సోమన, కృతులలో భాష, కథావస్తువు, ఛందస్సు మూడును దేశీయములే. తిక్కన భాషలో, భావములో దేసితనము చూపించినాడు. ఎఱ్ఱన హరివంశములోని కృష్ణుని బాల క్రీడా ఘట్టము ఆంధ్రవాఙ్మశియమున అసాధారణ దేశికవితా రచనము. శ్రీనాథుని పల్నాటి వీరచరిత్ర, కాటమరాజుకథ దేసికవితామయములు)

4. రెడ్డిరాజులు—ఆంధ్రభాషాసేవ

[ఈ వ్యాసమున శాస్త్రిగారు ప్రోలయ వేమారెడ్డినిగూర్చి, పెదకోమటి వేమారెడ్డినిగూర్చి, వారి భాషాసేవనుగూర్చి వివరించినారు. మెకంజీ లోకల్ రికార్డులలో రెడ్డిరాజుల దానధర్మముల, శాసనముల ప్రశంసలు పుష్కలముగా నున్నట్లు ప్రభాకరులు కనుగొన్నారు. రంగనాథరామాయణము శైలినిబట్టి చూడగా ఏకకవి కృతముగా తోచుచున్నట్లు అభిప్రాయపడినారు]

5. అన్నమయ్య

(కడపలో తాళ్లపాక గ్రామమున 15వ శతాబ్ది ప్రథమపాదమున అన్నమయ జన్మించినాడు. అతడు సుమారు 32 వేల కీర్తనలు రచించియుండ వచ్చును. సాళ్వ నరసింహరాయడు అన్నమయ సాయమున విద్యానగర సామ్రాజ్యము నాక్రమింపగల్గినాడు. కాని తనపై కీర్తనలు పాడనందుకు సంకెళ్లు వేసినాడు వేంకటేశునిపై కీర్తనలు పాడి అన్నమయ శృంఖలా విముక్తుడు కాగా రాయడు శరణాగతుడైనాడు...అన్నమయ్య శృంగార సంకీర్తనాంశము ఇన్నూరేండ్లకు క్షేత్రయ్యగాను, ఆధ్యాత్మ సంకీర్తనాంశము అటుతరువాత నూరేండ్లకు త్యాగయ్యగాను అవతరించెననవచ్చును)

6. వచనరచన—తాళ్లపాకవారు

[పెద తిరుమలాచార్యుని శ్రీ వేంకటేశ్వరవచనములను పరిష్కరించి ప్రకటించినపుడు శ్రీ శాస్త్రిగారాగ్రంథమునకు వ్రాసిన పీఠికలోని ప్రధాన విషయమే ఈ వ్యాసవిషయము. సమీక్షారూపమున ప్రాచీనవచన గద్యరచనా ప్రభేదముల వికాసమిందు చర్చింపబడినది. తాళగంధి[1] చూర్ణకములను గూర్చియు, వేంకటేశ్వరవచనముల యోగ్యతను గూర్చియు శాస్త్రిగారీ వ్యాసమున విశదీకరించినారు.

7. హరవిలాసము

[ఈ వ్యాసమున శ్రీనాథుని పలుకుబళ్ళు, భాషా విశేషములు, చమత్కారములు అనేకములు ప్రదర్శింపబడినవి).

(హరవిలాస కృతికర్త అవచితిప్పయసెట్టి. 1390 నుండి 1404 వరకు కొండవీటి రాజ్యమేలిన కొమరగిరి నృపాలున కాప్తుడు .... హరవిలాసములోని చిఱుతొండనంబి కథకు మూలము పాల్కురికి సోమన బసవపురాణకథ. శ్రీనాథుని రచనలోని లోతుపాతులను తెలియగోరువారు హరవిలాసమును చదవవలెను).

---

1. పీఠిక—శ్రీ వేంకటేశ్వరవచనములు 1945 లో. తి.తి.దే. ముద్రణము.

8. మనుచరిత్రము

[శాస్త్రిగారీ వ్యాసమున పెద్దన గ్రంథరచనా చాతుర్యమును, భావప్రకాశ మును, స్వభావ పరిజ్ఞానమును, భాషాంతరీకరణ చాతుర్యమును, వర్ణనావిధాన నమును, పోలికలను, కథాసంవిధానమును, శాబ్దిక గుణదోషములను చక్కగా వివరించినారు]

9. శతావధాని వెంకటశాస్త్రి

(రసస్ఫూర్తితో తెలుగుపద్యము చదువు చాతురికి వెంకటశాస్త్రిగారే ఆచార్యపీఠము... ఐందరులో వారి ఉపన్యాససంపర్కములేని పౌరసభ లుండేవిగావు. భోజరాజు ముఖ దర్శనమాత్రమున అనేకులు కవులైనట్లు శాస్త్రి గారి దర్శనముచేసుకొని అనేకులు కవిపండితులైరి. తిరుపతి వేంకటకవులు చిన్న శరీరులైనను కవితా విషయమున నొక్కరే. వెంకట శాస్త్రిగారి కవితా గంగా స్రవంతిలో తిరుపతి శాస్త్రిగారికవితా సరస్వతి అంతర్వాహినిగా నున్నది).

# పీఠికలు

1. తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర (చారిత్రక గ్రంథము)

'తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర' అసలు రచన చెన్నపురి ప్రాచ్య లిఖిత భాండాగారములో నున్నదనియు, హెచ్చుతగ్గులు చేయలేదుగాని క్రొత్త చేసితిననియు శాస్త్రిగారు పీఠికలో చెప్పుకొన్నారు. వారి 48 పుటల పీఠిక (తొడిమ అను పేరున ఉన్నది) తంజావూరాంధ్ర విజ్ఞాన సర్వస్వమన నొప్పినది. అందు విజయవిలాసము, రఘునాథాభ్యుదయము, సంగీతసుధ, రుక్మిణీపరిణయము మొదలగు నలబది గ్రంథములనుండి యుదాహరణము లివ్వబడినవి. వారి చారిత్రక పరిజ్ఞానమునకీ పీఠిక సాక్షిగానున్నది. మూలమును మించినది కనుకనే తన పీఠికను గూర్చి శాస్త్రిగారు ''అసలుకు మించిపోయినది కొసరు'' అని వాక్రుచ్చినారు.

తంజావూరునేలిన నాయకరాజుల రాజకీయ చరిత్ర; వారిభాషాసేవ; కావించిన దాన ధర్మములు; వారి అస్థానమునందున్న గోవింద దీక్షితులు,

శ్రీనివాస దీక్షితులు మొదలగు వారికి సంబంధించిన ముఖ్యాంశములు — 'తొడిమ' పేర్కొనుచున్నది.

ఆంధ్రభోజుడగు శ్రీకృష్ణదేవరాయల కులమును గురించి సలిపిన చర్చ సోప పత్రికముగా నున్నది. ఈ విషయము వారి సూక్ష్మ పరిశీలనమును వ్యక్తము చేయుచున్నది.

2. ప్రబంధరత్నావళి (సంకలన గ్రంథము)

ఇందు ఇర్వురు ప్రాచీన కవుల సంకలనములు సంధానింపబడినవి— ఒకరు ప్రబంధరత్నాకరమను పేరుతో పద్యములను సంకలనము చేసినవారు— 16వ శతాబ్దికి చెందిన పెద్దపాటి జగన్నాథకవి. రెండవవారి పేరు కానరాదు. శాస్త్రిగారు ఆ యిర్వురి కూర్పులోని పద్యములను గ్రుచ్చియెత్తి "ప్రబంధ రత్నావళి"ని క్రొత్త వెలయించినట్లు నుడివినారు. భాషా కవి చరిత్ర్యాద్యపేక్ష కులకీ ప్రబంధరత్నావళి ఎంతయో సహకరించగలదనియు పేర్కొనినారు. ప్రబంధరత్నావళిలో పేర్కొనబడిన అథర్వణాది కవులను గూర్చియు తత్కృతులను గూర్చియు తెలుపదగునూతనాంశములను విశదముచేసినారు.

3. అప్పనచారుచర్య (వైద్యగ్రంథము)

ఇది శాస్త్రీయ వైద్యగ్రంథము. శాస్త్రిగారు లభించిన రెండు ప్రతులను ఆధారముగా చేసుకొని ఈ గ్రంథమును స్వయముగా పరిష్కరించి ప్రకటించినారు. తంజావూరు (1916) దొరకిన పద్యములు కృత్యారంభపద్యములుగా చూపినారు.

బద్దెన నీతికిని, చారుచర్యకర్త శైలికిని సామ్యము గలదనియు, రెండును ఏకకాల రచనములనియును శాస్త్రిగారు విశ్వసించినారు. పీఠికలో పరిష్కరణకు సంబంధించిన విషయములేకాక రచనాకాలమునాటి స్థితిగతులను కూడ వివరించినారు.

4. భగవద్ధ్యానముక్తావళి. (శతకము)

చూడుడు : శ్రీకాకుళక్షేత్రము—'వ్యాసాలు'

5. భగవదజ్జుకము (ప్రహసనము)

గ్రంథకర్తృత్వమును గూర్చియు, గ్రంథ ప్రాచీనతను గూర్చియు, గ్రంథార్థమును గూర్చియు శాస్త్రిగారు అనేకవిషయములను సోపపత్తికముగా తమ పీఠికలలో వివరించినారు. గ్రంథకర్త బోధాయనుడేనని పేర్కొనుటకుగల ఆధారములు చూపినారు. క్రీ.శ. 600 సంవత్సరముల కాలమునాటిదీ ప్రహసనమని శాస్త్రిగారభిప్రాయపడినారు.

[ఇదిగాక సంస్కృతమున శాస్త్రిగారు వ్రాసిన పీఠికతో 'భగవదజ్జుకము' నాగరి లిపిలో అచ్చువేయబడినది.]

6. ఉద్భటారాధ్య చరిత్రము (ప్రబంధము)

చూడుము — మీగడ తఱకలు 125 — 151

7. మనుచరిత్ర.

చూడుము — మీగడ తఱకలు 151 — 164

8. ప్రతిమానాటకము.

శాస్త్రిగారు ఈ నాటకమును 1916 ప్రాంతమున తెనిగించి 1927లో ప్రచురించినారు.

రామాయణములో లేని సరికొత్త కల్పనలు భాస్కరుడు చేసినట్లుపేర్కొనినారు. ప్రథమాంకమున వల్కలకల్పనము, తృతీయాంకమున దశరథ ప్రతిమాకల్పనము, పంచమాంకమున దశరథ శ్రాద్ధాకల్పనము మొదలగునవి క్రొత్త విషయములని తెలిపినారు. "వాల్మీకిరామాయణ కథకును ఈ నాటికకును కొన్ని భేదములు కానవచ్చును.... ఇందు లక్ష్మణుడు పెద్దవాడుగను, భరతుడు చిన్నవాడుగను కనిపించును. ఈ విషయము వాల్మీకి రామాయణమున సంశయగ్రస్తముగానున్నది" అని శాస్త్రిగారు పీఠికలో వివరించినారు.

9. బసవపురాణము

మొట్టమొదట ఆంధ్రసాహిత్య చరిత్రలో శివకవులకు స్థానమును కల్పించి వారికి సంబంధించిన అధ్యయనమునకు నాందిపాడిన వారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

129 పుటలు గల్గిన పీఠికలో శాస్త్రిగారు పాల్కురికి సోమనాథుని చరిత్రము, కాలము, బసవపురాణ రచనాకాలము, సోమనాథుని కులగోత్రములు, గురువులు, సమకాలికులైన భక్తులు, సోమనాథుని కృతులు, నిష్ఠలు, నియమములు, వైదుష్యము, బసవపురాణ గౌరవము, బసవేశ్వర చరిత్రము, బసవన కృతులు, బిజ్జలుని చరిత్రము, పండిత త్రయము, శైవ, పాశుపత మతములు, బసవేశ్వరుని ఉపజ్ఞయే వీరశైవము, శివకవులు, జానుతెనుగు, దేశిరచన, ఛంద స్స్వాతంత్ర్యము, ప్రాసయతి విశేషములు, అసాధారణ ప్రయోగములు, శబ్ద విశేషములు, ప్రాతపలుకుబళ్ళు, అనుకరణములు, పరివర్తనముల తీరు, రచనా సౌందర్యము మున్నగు అనేక విషయములను శాస్త్రిగారు విమర్శనపూర్వకముగా వివరించినారు.

10. బసవోదాహరణము

ఉదాహరణ లక్షణములతోపాటు ఈ ఉదాహరణము యొక్క తీరుతెన్నులను పరిశీలించినారు.

11. నీతి ద్విషష్టికా

చూడుడు. మణిమంజరి, ఆగస్టు 1982, పుటలు 153–158.

12. క్రీడాభిరామము

"విషముష్టి విత్తులు, నాభి, నల్లమందు, ఉల్లి పాషాణము ఎట్టి చెడ్డ వస్తువులో ఈ క్రీడాభిరామము కూడ అట్టి చెడ్డ పుస్తకమే యనదగును. వస్తు పరిజ్ఞానము చాలనివారు... బాలురు, పామరులు, ముగుదలు అట్టి వస్తువులను ముట్టరాదు. ఇట్టి పుస్తకములను కూడ చేత బట్టరాదు" అని శాస్త్రిగారు పీఠికను ప్రారంభించినారు. "గ్రంథమామూలాగ్రముగ శ్రీనాథ రచనముగనే కన్పట్టుచున్నది" అని తీర్మానించినారు. "కృత్యవసాన పద్యము తానే తుమ్ముకొని తానే శతాయుస్సనుకొనునట్లున్నది" అని చమత్కరించినారు. శ్రీనాథుని మీద ఉన్న అభిమానముచే తానీ గ్రంథమును పరిష్కరించి పీఠిక వ్రాసినట్లు పేర్కొన్నారు. శైలినిబట్టి శ్రీనాథుడే గ్రంథకర్తయని చెప్పుట ప్రభాకరులనుసరించిన నవ్య విమర్శన పద్ధతి.

బూతులబుంగ యను అప్రథను గడించుకొన్న క్రీడాభిరామము ఏక శిలానగర చరిత్రకు దర్పణముగ నున్నదని శాస్త్రిగారు పీఠికలో వివరించి ఆ కావ్యమునకు చారిత్రకముగ స్థానమును కల్పించినారు. సంఘ జీవనము నింత సజీవముగా కన్నులకు కట్టినట్లు వర్ణించు కావ్యము క్రీడాభిరామమును మినహా యించినచో మఱియొకటి లేదని వచించినారు. అముద్రితములైన ఆదిలక్ష్మీ విలాసము, కామేశ్వరి చరిత్రము అను గ్రంథములను పరిశీలించి శాస్త్రిగారు కామేశ్వరి కథను (అక్కల చరిత్రము) కూడ పీఠికలో వివరించినారు.

13. బాలభాష

"భాష అడవివంటిది. కవిత యుద్యానము వంటిది... విచ్చలవిడిగా జీబుకొని వెలయుచున్న ఆంధ్రభాషారణ్యము నుండి కవితోద్యానమునకు కొని తేవలసిన హృద్యవచోవల్లరు లింకనెన్నో యున్నవి. చవులొలుకునవి, పలుకుబళ్లు, పాటలు, పదాలు, కథలు, గాధలు, సామెతలు....అపరిశోధితములై, యము ద్రితములై లోకము వాకులందే పుట్టుచుగిట్టుచునున్నవి. అట్టివానిని పరిశోధిం చుటలోను, సేకరించుటలోను నాకు కోరిక కొండంత" అని శాస్త్రిగారు తమ పీఠికలో మధుర వాఙ్మయమునకుగల ప్రశే కత ఎట్టిదో వివరించినారు.

"ఉన్నత కవితావాహినికి బాలవాఙ్మయమూటపట్టు. బాలభాషలో సహ జముగా నంకురప్రాయముగా గన్పట్టు కవితాగుణములే ప్రౌఢభాషలో సంస్కృ తములై బలుపొందుచున్నవి". అని శాస్త్రిగారు బాలభాషలో గొప్పదనమును తెలిపినారు. తేలికైనభాషలో, అర్థమయ్యేరీతిలో గేయరూపమున గల అనేకము లైన ఉదాహరణములలో బాలభాషయొక్క విశిష్టతను నిరూపించినారు.

14. ఉత్తరహరివంశము

15. హరవిలాసము (ప్రబంధము)
చూడుడు: "సింహావలోకనము" 115–147

16. సుగ్రీవ విజయము (యక్షగానము)
చూడుడు 'మీగడతఱకలు' 93–112

17. భారతీ శతకము (శతకము)

పీఠికలో శాస్త్రిగారు ఆంధ్ర భాషావ్యవహారములను గూర్చి వ్రాసినారు. కాలక్రమమున సముచిత సౌందర్యముతో వ్యవహారభాష పెంపొందగలదని ఆకాంక్షించినారు.

"భారతీదేవికి ప్రార్థనా రూపమున గూర్చిన ఈ భారతీశతకము ఆంధ్ర వాఙ్మయమున అపూర్వరచనమే" అని శాస్త్రిగారు పేర్కొనినారు.

18. మొయిలు రాయబారము (మేఘసందేశమునకు గేయానువాదము)

మొయిలు మెఱుగులు పేరుతో శాస్త్రిగారు 22 పుటల పీఠికను సంతరించినారు మూలములోని వ్యంగ్యార్థములకు భంగము వాటిల్లకుండా రచయిత తెనిగించినారనియును, మందాక్రాంతకు సమీపముగా చెప్పదగిన దేశిచ్ఛందో భేదము ననుసరించి నారనియు శాస్త్రిగారు తెలిపినారు. అనువాదపు తీరు తెన్నులను కూడ పరిశీలించినారు.

19. గోవిందరామాయణము

20. ఆంధ్ర రచయితలు

కందుకూరి కవుల చరిత్ర రచనమునుగ్గడించి దాని నింకను సంస్కరించ వలసినదని సూచించినారు. ఆదిభట్ల నారాయణదాసు నీకృతితో చేర్చుట బాగు అని అభిప్రాయపడినారు. పుస్తకమును చూడగనే తమ తలపుకందిన, గ్రంథ కర్త పేర్కొనని కరాలపాటి రంగయ్య, తంజనగరము దేవపెరుమాళ్ళయ్య, గురజాడ అప్పారావు ప్రభృతులు—పదునాల్గురి పేర్లను సూచించినారు. కవుల చరిత్ర పరిశీలనమున శాస్త్రిగారి ప్రజ్ఞ ఎంతనిశితమైనదో పై అంశము వ్యక్తము చేయుచున్నది.

21. శ్రీవేంకటేశ్వర వచనములు

చూడుము—సింహావలోకనము, పుటలు 90–114.

22. శృంగారకీర్తనములు

పీఠికలో శాస్త్రిగారు అంతకుముందు జరిగిన అన్నమాచార్యుల కీర్తనలు అపక్రమముగా సాగినట్లు తెలిపినారు. లభించిన తాళ్ళపాకవారి రచనముల రేకులు 2635లు పరిశోధించి, చిక్కులుదీర్చి, విషయవిభాగములు, ముద్రితాముద్రిత విభాగములు చేసినట్లు వ్రాసినారు.

23. శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు

పీఠికలో, శాస్త్రిగారు — ఈ గ్రంథమున 19 శతకములు గ్రహింపబడినట్లును, వాని నిదివరకెవ్వరును ప్రకటించనట్లును పేర్కొన్నారు. తంజావూరు సరస్వతీ భాండాగారము నుండి కొన్నింటిని, మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునుండి కొన్నింటిని సేకరించి తానీ సంకలనమును ప్రచురించినట్లు తెలిపినారు.

24. అన్నమాచార్య చరిత్ర

అన్నమాచార్యుల సంకీర్తన సాహిత్యమును వెలికి తీసి వెలుగులోనికి తెచ్చిన మహనీయులు ప్రభాకరశాస్త్రిగారు. ఆంధ్ర సంకీర్తన వాఙ్మయమునకు ప్రాణప్రతిష్ఠ గావించిన గౌరవమును వారే దక్కించుకొనిరి. "అన్నమాచార్య చరిత్ర పీఠికలో వారు పేర్కొనిన విషయ బాహుళ్యమును చూచినచో శాస్త్రిగారు జంగమ విజ్ఞాన సర్వస్వమని నుడువవచ్చును."*

పీఠికలో శాస్త్రిగారు అన్నమయ వంశము, బాల్యము, స్వామి సాక్షాత్కారము, దేవాలయ ప్రవేశము, అన్నమయ మహిమలు, అన్నమయ పురందర దాసులు, అన్నమాచార్య విగ్రహము, అన్నమయ సంకీర్తనములు, పలుకుబళ్ళు, భాషావిశేషములు, ఆళ్వార్లు—అన్నమయ్య, ఆంధ్ర సంకీర్తనములు—ద్రవిడ పాశురములు, అన్నమాచార్య చరిత్ర పరిశోధనము మొదలుగాగల అనేకాంశములు చర్చింపబడినవి.

---

* శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారు, పరిశోధన, ఆ. సె. 1954, పుట—81.

ప్రభాకరులు చిత్రపటములను సేకరించి, పీఠికాంశములకు అనుగుణముగా జతగూర్చి అన్నమయ జీవితచరిత్రకు మెఱుగులు దిద్దినారు.

25. శృంగారామరుకము

అమరకుడు ఒక రాజు కాదగియుండుననియు, నేర్పరియగు చిత్రకారుడు అమరకుని శ్లోకములను చదివినచో నూఱు చిత్రములు చిత్రింపగలడనియు శాస్త్రి గారు పీఠికలో వ్రాసినారు.

26. ధనుర్విద్యావిలాసము (శాస్త్రగ్రంథము)

కృష్ణమాచార్యుడు రచించిన ఈ శాస్త్రగ్రంథములోని విశేషములను శాస్త్రి గారు వివరించినారు. ధనుర్వేదము యజుర్వేదమునకుపవేద మెట్లైనదో తెలిపినారు. వైశంపాయన నీతిప్రకాశిక, వసిష్ఠసంహిత, శివధనుర్వేదము, మనుసారము, హరిహర చతురంగము, వీరచింతామణి, శివోక్త ధనుర్వేద సంహిత, భారతాదులలోని ధనుర్వేద విషయములను చర్చించినారు.

27. సుభద్రాకల్యాణము

శాస్త్రిగారు తమ పీఠికలో "అన్నమాచార్యుల పెద్ద భార్య తిమ్మక్కయే సుభద్రా కల్యాణ గేయ కృతి రచయిత్రి. సంగీత సాహిత్య చతురయగు ఈ యిల్లాలినేలిన యన్నమాచార్యుడదృష్టవంతుడు. తిమ్మక్క ప్రేయసిగా, భక్తిమయ గేయరచన కవితగా, శ్రీ వేంకటేశ్వరుడు స్వామిగా లభించిన అన్నమాచార్యుడు ధన్యుడు" అని వ్రాసినారు.

చేమకూర వేంకటకవికి తిమ్మక్క రెండు వందల యేండ్ల ముందున్నదనియు, వేంకటకవి సుభద్రాకల్యాణములోని పలుకుబళ్లను విజయవిలాసములో అనుకరించినాడనియు వేటూరివారు విశదపరచినారు.

'ముప్వగోపాల' పదమునకు ముప్వపురి గోపాలుడని కాక మువ్వలు దాల్చిన గోపాలుడని అర్థము చెప్పుకొనవలెనని ప్రభాకరులు తేటపరచినారు.

28. తిరుప్పావై — సప్తపదులు

తిరుప్పావై ద్రవిడదేశమందే గాక ఆంధ్రదేశమునను వైష్ణవులకు వాచోవిధేయమై యుండును. ధనుర్మాసమున దినమునకొక పాశురము చొప్పున ముప్పది రోజులు తెలవాఱకముందే అనుసంధించి స్వామినారాధింతురు. గొబ్బెమ్మలను పెట్టి తెలుగుదేశమున చేయు పూజాపద్ధతి తిరుప్పావైలోను కొంత కలదనియు, ద్రావిడవైష్ణవులు విష్ణుసంప్రార్థనార్థకమగు తిరుప్పావైని, ద్రావిడశైవులు శివసంప్రార్థనార్థకమగు తిరువెంబావైని కల్పించుకొందురనియు శాస్త్రిగారు వివరించినారు.

29. ఆంధ్రకామందకము. [రాజనీతిశాస్త్రము]

ఉపవేదములలో రెండవది అర్థవేదమని చెప్పుచు శాస్త్రిగారు ఆంధ్రసారస్వతమున గల అర్థనీతిశాస్త్రగ్రంథముల వివరములొసంగిరి. కవిరెట్టమత గ్రంథమున కృతిపతినగ్గించుచు అహోబలములోని మఠమునుద్ధరించెనని చెప్పిన విషయమునకు (ప)బలకముగా శాస్త్రిగారు అహోబలమహాద్వారముననున్న శాసనమును ప్రమాణముగా తీసికొని దానిని సమూలముగా ప్రకటించినారు. సందిగ్ధములుగా నున్న భాగములను తంజావూరికిపోయి మాతృకతో సరిచూసి పూరించినట్లు పీఠికలో చెప్పుకొన్నారు.

## వ్యాఖ్యలు

1. నన్నెచోడ కుమారసంభవము (అసమగ్రము)

శ్రీ ప్రభాకర శాస్త్రిగారు ప్రాచీనాంధ్రకావ్యములకు వ్యాఖ్యలు వ్రాయదలచిన వానిలో ఇదొకటి. 1948లో కుమారసంభవ వ్యాఖ్యకు ప్రోత్సాహము కల్గించినవారు పిఠాపురం మహారాజావారు. 8 ఆశ్వాసముల వరకు ముద్రిత పాఠములు. సవరణలు అను పేర పట్టికను తయారుచేసినారు. 36 పద్యములకు వ్యాఖ్య రచించినారు. ఆ తరువాత తిమ్మావఝ్ఝలవారు తొలిరెండాశ్వాసములకు టీక వ్రాసి త్రిలింగలో ప్రకటించినారు.

2. ఉత్తరహరివంశము :

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు 4 ఆశ్వాసములకు మాత్రము పాఠభేదములను పరిశీలించి సుందరపాఠములను గ్రహించి చక్కని వ్యాఖ్యానము గావించినారు. ఈ అముద్రితప్రతి 500 పుటలలో ఉన్నది.

శాస్త్రిగారు నాల్గాశ్వాసములకు పరిశిష్టములు కూడ కూర్చినారు. శాస్త్రవిషయములకు అనేక ప్రమాణములు చూపవలసినప్పుడు వానిని పరిశిష్టమున వారు చేర్చినారు.

## సమీక్ష

శ్రీ రాజశేఖరశతావధాని 'రాణాప్రతాప సింహ చరిత్ర'కు శాస్త్రిగారు వ్రాసిన సమీక్ష — (అముద్రితము)

(గడియారం వెంకటశేషశాస్త్రి శివభారతము, దుర్భాకరాజశేఖరశతావధాని రాణాప్రతాప సింహచరిత్రయు ఒకే కొమ్మన పూచిన రెండు పువ్వులు. రాణాప్రతాప సింహచరిత్ర, శివభారతము కలిసి ఉత్తరదేశపు భారతము (ఉత్తరభారతము) అగును. 20వ శతాబ్దిలోని మహాకావ్యములలో ఇదగ్రగణ్యము అని శాస్త్రిగారు చక్కని సమీక్ష వ్రాసినారు. ఇంకను ఈ సమీక్షలో కల్పిత, చారిత్రక కావ్యములకుగల భేదములను, ప్రతాపసింహ చరిత్రలోగల కండపట్టులైన ఘట్టములను వివరించినారు మరియు వస్త్వౌచిత్యమును, సంఘటనా ప్రాధాన్యమును చర్చించినారు)

## సంకలన గ్రంథాలు

1. చాటుపద్య మణిమంజరి :—

భాషా సాహిత్య పరిశోధనలకై ఆవసరమగు ఆధారగ్రంథములే 'సంకలన గ్రంథములు'. పల్లెటూళ్లలో, ముదుసళ్ల నోళ్లలో, తాళపత్ర గ్రంథములలో జీర్ణమగుచున్న పద్యములనసేకము సంపాదించి చాటుపద్యమణిమంజరిగా

శాస్త్రిగారు కూర్చినారు. ఈ సంకలనము ఆంధ్రుల చరిత్ర, ఆచారవ్యవహారములు, భాషాచమత్కారములు, సమస్యా పూరణములు మున్నగు వానినెన్నింటినో వెల్లడించుచున్నది.

చాటుపద్య మణిమంజరి ద్వితీయభాగము ప్రథమ సంపుటమున దేవతా స్తుతి పరములును, రాజులకు సంబంధించినవియును, ప్రాచీనార్వాచీన కవులు చెప్పినవియును అయిన చాటువులున్నవి. ఇందలి 'దామెరవారి వంశావళి' చెన్నపట్టణముతో ఆంధ్రులకుగల సంబంధమును తెలుపుచున్నది. ఒకేచోట కూర్చబడిన 'బిరుదావళి' పరిశోధకులకుపయోగపడుచున్నది. 1621లో రాతి బండపై చెక్కబడిన చెణకలి పద్యము చారిత్రక ప్రాధాన్యము కల్గినది ఈ సంకలనగ్రంథమున "దండయాత్రా ఘోషతమ్మటధ్వనులచే గంతులు సేయించె గప్పకొండ" అను చాటువును ప్రభాకరులు ప్రకటించినందుకు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వారిని కీర్తించినారు*

ద్వితీయభాగమున ద్వితీయ సంపుటము అముద్రితము. ఇందు మహాపురుషస్తబకము, శృంగారనీతి సంకీర్ణస్తబకములు, ఊళ్లు — నాళ్లు, గాలి కబుర్లు, సామెతలు పలుకుబళ్లు అను విభాగములున్నవి.

చాటుపద్య మణిమంజరి విజ్ఞాన వినోదములకు ఖనియనవచ్చును.

2. ప్రబంధరత్నావళి :—

ఇర్వురు ప్రాచీనకవుల సంకలనములను సంధానించి శాస్త్రిగారు 'ప్రబంధ రత్నావళి'ని ప్రచురించినారు. అందొకరు పెదపాటి జగన్నాథకవి, రెండవవారి

---

*Pandit V. Prabhakara Sastry, who has done yoemen service to the Telugu Literature, has to be congratulated for rescuing the valuable verse from oblivion. The verse, which seems to have been composed by Srinadha, narrates Allayya Vema's conquests, some of which do not find mention anywhere else—

—History of Reddy Kingdom
page 138,

పేరు తెలియరాదు. జగన్నాథకవి 5 ఆశ్వాసముల 'ప్రబంధరత్నాకరము'లో 3 ఆశ్వాసములు మాత్రమే లభ్యముకాగా శాస్త్రిగారు వానితో పాటు రెండవ సంకలనములో ప్రసిద్ధులైన నన్నయాదుల పద్యములుకాక ఇతరుల పద్యములను గ్రహించి తాము సంకలనము చేసినారు. కవిచరిత్రలు తెలిసి కొనగోరువారికి వీలగునట్లుగ అకారాదిక్రమమున ప్రచురించినారు. ప్రబంధ రత్నావళి మూలమున కందుకూరివారి కవులచరిత్ర ప్రథమభాగమున చేరదగిన కవులు బయల్పడినారు. "ప్రబంధరత్నావళి ప్రచురణతో భాషాపరిశోధనకు, కవిచరిత్ర పరిశోధనకు క్రొత్త కవాటములు తెఱచినట్లైనది" అని డా॥ పోచిరాజు శేషగిరిరావుగారు 'సంకలన గ్రంథసంధాతలు' అను వ్యాసమున వ్రాసినారు*

3. ఆంధ్రదేశవర్ణనము:—

ఉదయనంబి విలాసమను ప్రాచీన ప్రబంధములోని ఆంధ్రదేశవర్ణనము గల పద్యములను పరిశీలించి శాస్త్రిగారు ప్రత్యేకముగా ప్రచురించినారు.

4. బాలభాష :—

బాలభాషను మొదట సేకరించి 'భారతి' (1930) సంచికలలో ప్రకటించిన గౌరవము శాస్త్రిగారిదే. ఇందు 50 గేయములు ప్రచురింపబడినవి. పుస్తక రూపమునొందిన ఈ సంకలనమున ప్రతి గేయమునకును గోపిగీసిన చిత్రమున్నది. నేటికిని పిల్లలనాల్కలపై నున్న గుడుగుడుగుంచం, చెమ్మచెక్క, దాగుడుమూతలు, ఒప్పులకుప్ప మున్నగు నవీ సంకలనము నందున్నవి. కూనలమ్మ పదాలుకూడ ఇందు గ్రహింపబడినవి. ఆరుద్ర కూనలమ్మ పదాలు వ్రాయుటకు శాస్త్రిగారు సేకరించిన పదములే ప్రేరకములైనవి. శాస్త్రిగారికి బాల వాఙ్మయముపైగల ఆసక్తికి ఈ 'బాలభాష' నిదర్శనము.

5. శ్రీ వేంకటేశ్వర లఘు కృతులు :-

శాస్త్రిగారు శ్రీవేంకటేశ్వరునిపై ఎందరోకవులు రచించినస్తుత్యాత్మక పద్యములతో ఈ సంకలన గ్రంథమును ప్రకటించినారు. దీని మూలమున తాళ్లపాక కవుల సాహిత్య పరిశోధనకు మార్గము వేయబడినది. ఇందు ఇంతకు పూర్వ

1. మణిమంజరి, ఫిబ్రవరి 1981, పుట : 8

మెవ్వరును ప్రకటింపని 19 కృతులను శాస్త్రిగారు ప్రకటించినారు. కర్తృత్వము తెలియని రచనలుకూడ ఇందున్నవి.

6. శ్రీ వేంకటేశ్వరస్తుతిరత్నమాల:—

ఇందు తాళ్లపాక పెద తిరుమలాచార్యుని శ్రీ వేంకటేశ్వరప్రభాతస్తవము, ఎఱ్ఱన నృసింహపురాణములోని పద్యములు, కవికర్ణరసాయనము, కళాపూర్ణోదయము మొదలగు 16 కావ్యములలోని పద్యములు (శ్రీ వేంకటేశ్వరస్తుతిపరములైనవి) సంకలనము చేయబడినవి.

7. గాంధీరామాయణము:—

మహాత్ముని నిర్యాణానంతరము ప్రజాహృదయములలో ఉప్పొంగిన శోకమునక్షరబద్ధమొనర్చి రచనలు పంపవలసినదిగా శాస్త్రిగారు ఆంధ్రపత్రిక (7–1–1950)లో ప్రకటన ఇచ్చి వచ్చిన రచనలను 'గాంధీరామాయణము' అను పేరుతో సంకలనము చేయదలచినారు. కొన్ని మణిమంజరిలో వచ్చినవి. అముద్రితా సంకలనము శ్రీ ప్రభాకర పరిశోధక మండలి వారికడనున్నది.

## ఉపన్యాసములు

1. నన్నయకు పూర్వము ఆంధ్రభాష :—

[తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర కళాశాలలో ఈ విషయంమీద శాస్త్రిగారు ఉపన్యసించినారు.]

(ఆంధ్ర అనే పదము మొదట జాతి వాచకము. తరువాత దేశవాచకము. ఆ తరువాత వారు మాట్లాడే భాషకు పేరైనది. తెనుగు—తెన్ + అగు అనగా దక్షిణభాష అనుటకు సరియైనది)

2. నవ్యసాహిత్య పరిషత్తు - ఉపక్రమోపన్యాసము :—

ముక్త్యాలలో జరిగిన నవ్యసాహిత్య పరిషత్తు — 11వ వార్షికోత్సవములో శాస్త్రిగారుపన్యాసముచేసినారు. శ్రీ రాజా రామగోపాలకృష్ణ మహేశ్వరప్రసాద బహదర్‌గారు పరిషత్ సంమాధ్యక్షులుగానుండిరి.

తిరుపతి వేంకటేశ్వరుని సన్నిధిలో విద్యాజీవనమును కూర్చుకొని ఏకాంతముగా కాలక్షేపము చేయుచున్న తనను సభారంగమునకాహ్వానించి కవివర్యుల మనోజ్ఞరచనలు వినగలిగే అవకాశము కల్గించిన గురుదేవుల విద్యానుగ్రహమునకు నమస్కారములు అని శాస్త్రిగారుపన్యాసమును ప్రారంభించినారు. వారి ఉపన్యాసములో ఆంధ్రదేశ పూర్వవైభవము, నాగర్జున కొండ ప్రశస్తి, ఇక్ష్వాకురాజుల ఘనకార్యములు, సాతవాహన సప్తశతిలో మూక్త్యాలవర్ణన కథలు పేర్కొనబడినవి.

సభాధ్యక్షులైన మల్లంపల్లి వారిని గూర్చి "ఏండ్లతరబడిగా తిరువలిక్కేణి నుండి మ్యూజియము దాకా కలిసినడిచి రాకపోకలు జరుపుటలో మాకాళ్లు, రోడ్లూ కూడ అరిగినవి. శ్రీ శర్మగారిలో ఉన్నది కొండంత. వారుపయికి గానవచ్చునది కుండంత" అని శాస్త్రిగారు ప్రసంగించినారు.

"1912–13 ప్రాంతములలో వాడుకభాషలోనే నేను కొన్ని గ్రంథములను ప్రకటించినాను. సభలో వాడుకభాషలో మాట్లాడడం, పత్రికలలో వ్యాసాలు వ్రాయడం కూడా తప్పుగా భావించే కాలమది" అనుచు గిడుగురామమూర్తి సాధించిన కార్యమును నిర్వహించవలసినదని నవ్యసాహిత్య పరిషత్తు వారిని శాస్త్రిగారు కోరినారు.

"1914లో అనారోగ్యంకల్గింది. ప్రతిదినము నాకు మరణయాతనే 1916లో నిర్బంధముమీద మరల ఉద్యోగములో చేరవలసివచ్చింది. కానిచో హరిద్వారములో గంగాప్రవాహంలో ఐక్యమందుదుగాక యని నిశ్చయించుకొన్నాను" అనుచు గతస్మృతులను వెల్లడించినారు.

శాస్త్రిగారు తమ ఉద్యోగ జీవితము, ఆధ్యాత్మిక జీవితము, సాహిత్యజీవితము—వీనికిసంబంధించిన అనేక సంఘటనలను వివరించినారు. వాల్మీకిరామాణమును గూర్చి, భవభూతి "ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోనుధావతి" అను సూక్తిలోని పరమార్థమును గూర్చి తెలిపినారు.

శేషశాస్త్రిగారు, రాజశేఖర శతావధానిగారలు పొద్దుటూరులో పొడమిన సూర్యచంద్రులని పొగడినారు. అడవిబాపిరాజు, శివశంకరశాస్త్రి మొదలగు

కవులను ప్రశంసించినారు "మీరచనలలో వర్ణ్యవస్తువులు కొత్తవి. వాటిని తీర్చేతీరులు సరికొత్తవి" అని నవకవులను కొనియాడినారు. గాంధీమహాత్మని వంటి పుణ్యపురుషుల సంకల్ప బలమువల్ల భారతదేశము యుద్ధ జ్వాలలలో మాడి పోకుండా నిల్చినది. భారతదేశ ప్రధాన ప్రజాబలము అహింస అనెడి కల్ప వృక్షపు కొమ్మనే పట్టుకొన్నది అని విశదీకరించినారు. "మీ రచనలన్నీ మీ తల్లులూ, బిడ్డలూ, మీ కుటుంబినులూ, అయినవాళ్లూ, కానివాళ్ళూ అందరూ సవిమర్శనముగా చదువుకొని సంతోషించ దగ్గవిగా ఉండాలి" అని శాస్త్రిగారు నవకవులనుద్బోధించారు

3 విజ్ఞాన సభ

ప్రభాకరుల అధ్యక్షతన తిరుపతి దేవస్థానమువారి హిందూ హైస్కూలులో విజ్ఞానసభ జరిగినది. "విద్యార్థుల సభకు నన్ను పిలవడం పాలపొంగులోకి సీటి చుక్కవలె ఉంది. పట్టాభి సీతారామయ్యగారన్నట్లు 'విద్యార్థుల పరుగు, ముసలి వారి నడకా రెండూ కలిస్తేనే దేశాభ్యుదయం" అని ప్రసంగించినారు. తమ ప్రసంగముతో గాంధీగారిని గురించి, కమ్యూనిస్టులను గురించి అనేక విషయ ములు తెలిపినారు భోజనకాలమందు, సాయంసంధ్యలందు ప్రార్థనలు చేసికొన వలెననియు, మాతృభాషలో నిశితప్రజ్ఞను పొందవలెననియు విద్యార్థులకు సందేశ మిచ్చినారు.

4. "యోగము—విశ్వచైతన్యము & అనుభూతి—సమన్వయము"

యోగమిత్రుల నుద్దేశించి చేసిన ఈప్రసంగములలో యోగము, ప్రకృతి, పురుషుడు—వీనికి సంబంధించిన అనేక అంశములు వెల్లడింపబడినవి.

5. స్వాతంత్ర్యదినోత్సవము

1947 ఆగస్టు 14 రాత్రి 12 గంటలవేళ తిరుపతిలో సీతారామవిలాస్ భవనము మీద భారత పతాక నెగురవేసి, ప్రార్థనానంతరము శాస్త్రిగారు మిత్రగోష్ఠిలో చేసిన ప్రసంగ మిది. వారి ప్రసంగము మహాత్ముని మహోన్నత శీల మును వ్యక్తముచేయుచున్నది.

6. శ్రీత్యాగబ్రహ్మోత్సవ మండప ప్రవేశోపన్యాసము :-

త్యాగరాజుకీర్తనలన్నియు లోతుతరచి చూచినచోగాని అర్థము తేటపడదని శాస్త్రిగారు వివరించినారు. అందుకుదాహరణముగా 'తరముగాని యెంతవేళా కల్పతరునీడ దొరికినట్లాయె' అన్న కీర్తనలోని అంతరార్థమును కథాపూర్వకముగా ఎరిగించినారు.

7. శరీరాన్ని పరిశోధించగా తేలిన పరమార్థమే పరమాత్మ :—

'ప్రజ్ఞాప్రభాకర' గ్రంథప్రారంభోత్సవ సభలో శాస్త్రిగారు చేసిన ప్రసంగమిది.

తమ 25వ ఏట వచ్చిన భయంకరమైన వ్యాధి మాస్టరు సి.వి.వి దయవలన తొలగినదనియు, శరీర పుస్తకాధ్యయనమువలన ప్రజ్ఞ ఒకచోట పాదుకొనును, అదే కుండలిని యనియు, ఉదయమున దూరముగానున్న చెట్టునీడ మధ్యాహ్నము చెట్టులో లీనమైనట్లు ప్రపంచము భగవత్తాదాత్మ్యము చెందవలెననియు, ఆదివ్యప్రజ్ఞ ప్రపంచమున కందునాటికి జాతిమతవర్ణవిచక్షణ రూపుమాసిపోవునసియు శాస్త్రిగారు తెలిపినారు.

8 శ్రీనాథజయంతి :—

రాజమహేంద్రవరమున కళాభివర్ధనీ పరిషత్తు ఆధ్వర్యమున శ్రీనాథజయంతి జరిగినది. ఆ సందర్భమున శాస్త్రిగారికి సన్మానము కూడా జరిగినది. ప్రభాకరశాస్త్రిగారు శ్రీనాథుని కవితావైభవమును గూర్చి ప్రసంగించినారు.



# పరిశిష్టము

మణిమంజరి, ఫిబ్రవరి 1982–5వ సంపుటములో ప్రచురింపబడిన శాస్త్రి గారి స్వీయరచనలు మరియు వారి సాహిత్య వ్యక్తిత్వమును ప్రతిబింబించు ఇతరుల రచనలు:

1. వేంకటేశ్వర వాఙ్మయోద్ధారకుడు (వి) డా॥ పోచిరాజు శేషగిరిరావు, 1-3 చూడుము – ఆంధ్రాభ్యుదయము (మాసపత్రిక) 1925.
2. చిన్ననాటి చేష్టలు (లఘుకృతి) 17–20.
3. తెలుగు తెలువుల మేరువు (వ్యాసం) 21,22; చూ: తెలుగుతల్లి (లక్ష్మణ రాయవర్ధంతి సంచిక) అక్టోబరు 1944, పు: 30, 31
4. నా క్రొత్తపంథా – వేటూరివారి చేయూత (వ్యక్తిత్వ) వి.వి. రాజమన్నార్ 23, 24.
5. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు (వ్యక్తిత్వ) మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి, 25–27. చూ: భారతి ప్రమాది, కార్తికము.
6. రంగనాధరామాయణం-రామలింగారెడ్డిగారితో ఉత్తరప్రత్యుత్తరాలు: (వి) డా॥ వేటూరి ఆనందమూర్తి, 28–40.
7. నాటకకళ (సా) 41-46. చూ: కళ, (సంపు: 2, సంచిక: 4) 1924.
8. కూర్మాష్టకము (సంకలనపద్యాలు) వే. ప్ర. శా, 47, 48.
9. రాధాకృష్ణ నాటక ప్రయోగ ప్రశంస (పద్య) 49, 50 (రచనాకాలం 1–3–1924)
10. చిత్రనళీయనాటక ప్రయోగ ప్రశంస (పద్య) 50, 51 (రచనాకాలం 5–3-1924)
11. మైలవరం బాలభారతీ నాటక సమాజ ప్రశంస (పద్య) 51,53, రచనాకాలం. 11–3–1924)

12. గురుదేవుల డైరీ నుండి ఒక పుట: 60.
13. గాంధీరామాయణం (సంకలనం) 61-63
14. *పుణ్యవతి–భాగ్యవతి (కథ) 64—67
15. ఆంధ్రాభిమానం (పద్య) 68-70
16. నాచన సోమనాథుని ఉత్తరహరివంశము (సవ్యాఖ్యానం) 71-76.
17. నా ఎరుకలో (వ్యక్తిత్వ) డా॥ వేటూరి సుందరమూర్తి, 77-82.
18. అభయం (లేఖ) 83.
19. వంశప్రశంస (వ్యక్తిత్వ) కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, 84.
20. వేటూరి వారి వంశవృక్షం : పుట—85
21. దక్షిణాంధ్ర బాలకుడా! (పద్య) 86, 87 : చూ: దక్షిణఆంధ్రపత్రిక, మే 1927

(పరిశోధకరుల రచనలకు ఆంగ్లానువాదాలు)

1. *A New Sanskrit work of Krishnadevaraya*: *Tr-M Prabhakara Rao*, 8—10 (*From* : *Journal of Oriental Research—Madras, vol : XIII, Part* 3, *July* (*Sept* 1939, 194-196 .)
2. *Introduction of Tiruppavai. Tr-Dr. M. R. Satyanarayana*, 17—19.
3. *Pragna Prabhakaram* : *Tr—Dr. V. Ananda Murthy*, 22-26.

మణిమంజరి, ఆగస్టు 1983-6వ సంపుటములో ప్రచురింపబడిన శాస్త్రి గారి స్వీయ రచనలు మరియు వారి సాహిత్య వ్యక్తిత్వము ప్రతిబింబించు ఇతరుల రచనలు:

1. సాహిత్యకజిజ్ఞాస - వేటూరి వారి యోగజీవితపరిణామము (వ్యక్తిత్వ) ముదివేడు ప్రభాకరరావు, 1-10

---

* గౌతముడు అన్నకలం పేరుతో 'ఆనందవాహిని' అక్టోబరు 1, 1930లో ప్రచురణము, 7—10.

2. ప్రజ్ఞా ప్రభాకరము (వ్యక్తిత్వ) కొత్త రామకోటయ్య, 11-15.
3. ఆశీర్వచన నవరత్నములు (పద్య) 16-18 (రచనాకాలం. 1929)
4. బాలకుల పలుకులు (లఘుకృతి) 19. చూ: సాహితి (సం:4, సంచిక 2) 1923, 541, 542.
5. ముద్దుల బిడ్డడు (పద్య) 20, చూ: భారతి, జూలై 1924
6. కృతార్థుడు (పద్య) 21 ; చూ . భారతి, ఏప్రెల్ 1924, 92.
7. బుద్ధదేవుడు (పద్య) 21, 22 ; భారతి, మార్చి 1924.
8. సమీక్ష (రాజశేఖర శతావధాని రాణాప్రతాప చరిత్రమునకు), 24—34
9. తిరుప్పావై-సప్తపదులు—పీఠిక : 43—44
10. తిరుప్పావై—సప్తపదులు : 45—52
11. లవంగి (వ్యాసం) 53,54; చూ. కృష్ణాపత్రిక, 14 అక్టో 1916.
12. తంజావూరి రాజుల విగ్రహములు (వ్యాసం) 55, 56
13. నాకుతోచినమాట (వి) వేటూరి ఆంజనేయులు, 57—63
14. లేఖ (చల్లా సూర్యనారాయణశాస్త్రికి 1916లో వ్రాసినది) 64
15. *యోగ విషయము (ఉపన్యాసం) 65—68 ; (6-8-1947 నాటిది)
16. నాచన సోమనాథుని ఉత్తర హరివంశము—సవ్యాఖ్యానము: 75—85
17. చాటుపద్య మణిమంజరి (సంకలనం) 86
18. తంత్రానందస్వామి (కథ), 89—94; చూ. ఆనందవాహిని, అక్టో 1930
19. గురుదేవుల డైరి నుండి ఒక పుట. 103
20. గాంధీరామాయణం (సంకలనం—గతసంచిక తరువాయి) 104, 105,
21. నా ఎరుకలో (గత సంచిక తరువాయి) డా॥ వేటూరి సుందరమూర్తి, 106-112

ఆంగ్లములో—

1. *Childhood Adventures-Custard Apple* (లఘుకృతి) *Tr. Veturi Anjaneyulu*, 69-74

---

*సేకరణ : కొత్త వేంకటేశ్వరరావు.

2. *Obituary Note: P. Bala Krishna Murthy,* 113–115
3. *Pragna Prabhakaram: Tr. Dr.V. Ananda Murthy,*116-119

మణిమంజరి* ఫిబ్రవరి 1984-7వ సంపుటములో ప్రచురింపబడిన శాస్త్రిగారి స్వీయరచనలు, వారి వాఙ్మయ వ్యక్తిత్వము ప్రతిబింబించు ఇతరుల రచనలు:

1. కామధేనువు కథ (కథ) 5
2. హెచ్చరిక (వ్యక్తిత్వ) రెంటాల వెంకట సుబ్బారావు పంతులు, 14–22
3. నా ఎరుకలో (వ్యక్తిత్వ–గతసంచిక తరువాయి) డా॥ వేటూరి సుందర మూర్తి, 23-27
4. వినోద విమర్శము (వి) 28–40
5. నాచన సోమనాథుని ఉత్తర హరివంశము–సవ్యాఖ్యానము : 43–47
6. *యోగవిషయము (ఉపన్యాసము) (6 8-1947 నాటిది) 48, 49
7. ప్రాణేశ్వరుడు (గేయం) 50
8. గురుధ్యానమ్ (వ్యక్తి) దేవులపల్లి అప్పల నృసింహశర్మ, 51, 52
9. ప్రజ్ఞాప్రభాకరము (వ్యక్తి) కొత్త రామకోటయ్య, 53–56
10. గాంధి రామాయణము (సంకలనం) 57–59
11. చాటువులు (చిత్రకవితా రచనలు) 61–64
12. చాటుపద్య-మణిమంజరి (సంకలనం) 65–67
13. పద్యలేఖ (చల్లా సూర్యనారాయణశాస్త్రికి వ్రాసినది) 68, 69.
14. శివయోగసారము – అవతరణిక : 70–75, చూ. సుభాషి, నవంబరు 1927, 74–79.

---

*'చిన్ననాటిచేష్టలు–సీతాఫలము' అనుదానికి అనువాదం.

*సేకరణ : కొత్త వెంకటేశ్వరరావు.

15. నమస్కారములు : ఉభయకుశలోపరి (చిత్తూరు నాగయ్య శాస్త్రిగారికి వ్రాసిన లేఖలు) 81–84.
16. శ్రీకాకుళక్షేత్రము (వ్యాసం) 85–87, చూ. ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము, 1921–దుర్మతి, మాఘ శు॥ 8 శనివారము.
17. శివాజిమహారాజు : 88, చూ. కృష్ణాపత్రిక సంపాదకీయం, 3-3-1917
18. హితోపదేశము (లఘుకృతి) : 115–116.

## ఆంగ్లములో—

19. *Pragna Prabhakaram*: *Tr – Dr. V. Ananda Murthy*, 89–91.
20. **A Broken Harp (short story)* : *Tr – V. Anjaneyulu*, 97–114, *Published in Bharathi, August* 1924.

మణిమంజరి, ఆగస్టు 1984 - 8వ సంపుటము - బౌన్ – ప్రభాకర వర్ధంతి సంస్మరణ సంచికలో ప్రచురితమైన ప్రభాకరుల స్వీయరచనలు మరియు వారి వాఙ్మయ వ్యక్తిత్వమును ప్రదర్శించు ఇతరుల రచనలు.

1. తీయనితలపులు (వ్యక్తిత్వ) ఎన్. ఎ నారాయణరావు, 1–4.
2. స్మృతి (వ్యక్తిత్వ) బయిరెడ్డి సుబ్రహ్మణ్యం, 5–7.
3. అస్తమయం (వ్యక్తిత్వ) డా॥ పోచిరాజు శేషగిరిరావు, 8–11 (రచనా కాలం : 3-9-1950).
4. *తిమ్మావజ్ఝలవారి లేఖ : 12–13.
5. అందఱు చదువవలసినది (పద్య) 15.
6. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము (వ్యాసం) 15–17.

---

* శాస్త్రిగారి 'కరుణకము' అను కథకు అనువాదము.

* సేకరణ : డా॥ పోచిరాజు శేషగిరిరావు.

7. చార్లెస్ ఫిలిప్ బ్రౌన్ దొరగారు (వ్యాసం) 18—20.
8. సి. పి. బ్రౌన్ దొరగారు (వ్యాసం) 51—53, చూ. త్రిలింగ, డిసెంబరు 15, 1923.
9. బ్రౌను జాబు (సంకలనం) 53—58.
10. బ్రౌన్‌దొరనాటి దయ్యాల వృత్తాంతాలు (సంకలనం) 71—73.
11. బాటతప్పిన బండి (వి) డా॥ వేటూరి శంకరశాస్త్రి, 74—84.
12. చాటు లేని చాటుధారలు (వి) డా॥ వేటూరి ఆనందమూర్తి, 103—116
13. శ్రీ కూర్మాష్టకము (సంకలనం) 117—118.
14. నాచన సోమనాథుని ఉత్తర హరివంశము (వ్యాఖ్యానం) 119—125.
15. ప్రజ్ఞాప్రభాకరము (అనుభవాలు) కొత్త రామకోటయ్య, 129—132.
16. నాకు తోచినమాట (వ్యక్తిత్వం) వేటూరి ఆంజనేయులు, 133—141.
17. యోగవిషయము (ఉపన్యాసము) 142—147, 7-4-47 నాటిది.
18. నూతన వర్షము (పద్య) 150.

మణిమంజరి, ఫిబ్రవరి 1985 - 9వ సంపుటములో ప్రచురింపబడిన శాస్త్రిగారి స్వీయరచనలు మరియు వారి సాహిత్యవ్యక్తిత్వము ప్రతిబింబించు ఇతరుల వ్యాసములు :

1. ఆంధ్రఛ్ఛందోవిశేషములు (వి) రామచంద్రాచార్యులు, 1—9.
2. ఎసగు — ఒసగు (వి) రామచంద్రాచార్యులు, 10—15.
3. పండితారాధ్య చరిత్రము (వ్యాసం) 16—27.
4. చాటుపద్యమణిమంజరి (సంకలనం) 28—31.
5. శ్రీకాకుళక్షేత్రము (మణిమంజరి, ఫిబ్రవరి 1984 సంచిక తరువాయి భాగము) (వ్యాసం) 32—37, చూ : ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము 1921 దుర్మతి, మాఘ బ॥ 14, శనివారము.
6. గురుస్మరణము (పద్య) బయిరెడ్డి సుబ్రహ్మణ్యం, 58.

7. నా ఎరుకలో (వ్యక్తిత్వ—మణిమంజరి. ఫిబ్రవరి 1984 సంచిక తరువాయి భాగము) 59-63.

*8. యోగవిషయము—ఉపన్యాసము : 64—70 (18.9.1947 నాటిది)

9 ప్రజ్ఞాప్రభాకరము (వ్యక్తిత్వ) కొత్త రామకోటయ్య, 71-75.

10. గాలికబుర్లు (వ్యాసం) 81—91; చూ : ఆంధ్రపత్రిక, జనవరి, ఫిబ్రవరి, జూన్ మాసములు 1944.

11. అభిరుచులూ—అభిప్రాయాలూ (వ్యక్తిత్వ) డా॥ పోచిరాజుశేషగిరిరావు 92-96.

12. గురుదేవులు శ్రీ ప్రభాకరశాస్త్రిగారి సంస్మరణ (పద్య) వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వరప్రసాద్, 97.

13. మోహరి (వి) వాసిరెడ్డి దుర్గాసదాశివేశ్వరప్రసాద్, 98, 99.

14. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వ్రాతప్రతులు నోటు బుక్ నెం. 28(1914) 100-102.

15. లేఖలు : 103—133. (ఇందు శాస్త్రిగారు ఇతరులకు వ్రాసినవి, ఇతరులు శాస్త్రిగారికి వ్రాసినవి వరుసగా గ్రహింపబడినవి. 1. శ్రీ ప్రభాకరుల లేఖ 2. శ్రీ ప్రభాకరుల లేఖ 3. చెరుకువాడ నరసింహంగారి లేఖలు. 4. రాళ్ళపల్లివారి రెండు లేఖలు. 5. వేమూరివారి లేఖ. 6. అడవి బాపిరాజుగారి లేఖ. 7. తాతా సుబ్బరాయశాస్త్రిగారి లేఖ 8. వెంకటస్వామినాయుడుగారి లేఖ. 9. కొన్ని టెలిగ్రాములు-లేఖలు 10. వార్లవారి లేఖలు.



---

* సేకరణ : కొత్త వెంకటేశ్వరరావు.

# ముఖాముఖీ

## డా. పోచిరాజు శేషగిరిరావుగారితో

(24–10–1982)

[డా॥ పోచిరాజు శేషగిరిరావుగారు పెద్దాపురం మహారాణీ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేయుచున్నారు "వేటూరి వారి సారస్వతవరివస్య" అను సిద్ధాంత గ్రంథమును వ్రాసి 1980లో ఆంధ్ర విశ్వవిద్యాలయము నుండి డాక్టరేట్ పట్టమును తీసికొన్నారు. ప్రభాకరులను గూర్చి ప్రశ్నించగా అనేక విషయములు వారు ముఖాముఖీ తెలిపినారు. ఆ విషయము లిక్కడ పొందుపరచు చున్నాను.]

1. శ్రీ ప్రభాకర శాస్త్రిగారు తిరుపతిలో శ్రీవేంకటేశ్వర ప్రాచ్య కళాశాలలో పనిచేయునపుడు 1941 నుండి 1946 వరకు నేను వారికి ప్రత్యక్షశిష్యునిగా ఉన్నాను.

2. ఐదేళ్ల కృషిచేసినా ఇంకను శాస్త్రిగారి సాహిత్య కృషిపై సర్వంకషమైన పరిశోధన జరగలేదనే అసంతృప్తి, జరగాలనే ఆకాంక్షా ఉంది.

3. శతావధాని చెళ్లపిళ్లవారి వద్ద శిష్యులై కలంపట్టినవాళ్లు కవులు కాకుండా పోలేదు. పదులకొలది ఖండకృతులు, వందలకొలది పద్య కవితలు చెప్పిన ప్రభాకరులు కవిగాకపోవటమేమిటి ? అవిచ్ఛిన్నంగా నలభైఏళ్లు కవితాధారలు ప్రసరించినవారు. కాని చిత్రమేమిటంటే ఆధునికయుగంలో ఏ ఒక్క కవితా సంకలనంలోను వారి పద్యాలు కనిపించకపోవటం తీరనిలోటుగానే కన్పిస్తుంది.

4. సాహిత్య ప్రపంచంలో శాస్త్రిగారొక్క వివాదాస్పదమైన వ్యక్తి (*Controversial figur*). ఆ వ్యక్తిత్వమే సాహిత్యంలో క్రొత్త విషయాలను

త్రవ్వటానికి ప్రేరకమైంది. నన్నెచోడుని కాలనిర్ణయమైనా, క్రీడాభిరామ కర్తృత్వ చర్చయైనా, అహదనకరశాసన పరిశోధనయైనా, రంగనాథ రామాయణ కర్తృత్వ విషయమైనా గ్రంథగ్రంథులు విప్పుటలో వారి వ్యక్తిత్వం వ్యక్తమౌతుంది.

5. శాస్త్రిగారు తమ యోగశక్తిని వ్యక్తిగత మోక్షాదులకు గాక తానున్న సమాజానికి ఉపయోగపడాలనే ఆకాంక్షతో నరపేక్షంగా ధారవోసిన మహాత్యాగి. నాకు వారిమూలంగా కల్గినయోగానుభూతిని ఇటీవల ప్రచురించిన 'ఆనందవల్లి'లో తెలిపేఉన్నాను.

6. మీరు చేస్తున్న వాఙ్మయ సూచిక నిర్మాణం వల్ల క్రొత్తరచనలు, క్రొత్త విషయాలు తెలియగలవని ఆశిస్తున్నాను.

7. పత్రికలను ప్రత్యక్షంగా నడపకున్నా శాస్త్రిగారు పరోక్షంగా 'ఆనంద వాహిని', 'సరస్వతి' పత్రికలకు సంపాదకులుగా ఉండిరి.

8. 'భారతి' మాసపత్రిక ఆరంభమగుటకు కర్ర నాగేశ్వరరావు పంతులైనా ప్రేరణ శాస్త్రిగారిదే.

9. శాస్త్రిగారికి సాహిత్య సేవయందున్న గాఢాసక్తి యశోలిప్సయందు లేదు తన జీవిత పరమార్థము ప్రాచీన గ్రంథ సముద్ధరణమే అని శాస్త్రిగారు చెప్పు కొన్నారు.

## డా. వేటూరి ఆనందమూర్తిగారితో
(13–11–1982)

[డా॥ వేటూరి ఆనందమూర్తిగారు ఉస్మానియా విశ్వవిద్యాలయము తెలుగుశాఖలో పనిచేయుచున్నారు. "తాళ్లపాక కవులు" అను సిద్ధాంత గ్రంథమును వ్రాసి డాక్టరేట్ పట్టమును తీసికొన్నారు. ప్రభాకర పరిశోధక మండలి స్థాపించిన వారిలో వీరొకరు. ప్రభాకరశాస్త్రిగారిని గూర్చి కొన్ని విషయములు తెలియగోరి ప్రశ్నలవిన్యాగా వారు ముఖాముఖీ తెలిపిన విషయముల నిక్కడ పొందుపరచుచున్నాను]

1. ప్రభాకరుల రచనలన్నియు సమగ్రముగా లభించినవా?

అన్నీ లభించా యనలేను, ఎన్నో రాశారు ఎన్నెన్నో విషయాల మీద. అవి వెనకటి పత్రికల్లో అచ్చుపడ్డవి కొన్ని. అచ్చుపడనివి దొరక్కపోవు! ఎటొచ్చీ వాటికోసం ఏ వేటపాలెం, బందరు, కలకత్తా లైబ్రరీల్లోనో, ఆంధ్ర పత్రిక ఆఫీసులోని రికార్డుల్లోనో, సంస్థాధీశుల స్వాధీనంలో వుండిన పాత పుస్తకాల కట్టల్లోనో, ఆసక్తి వుండి దాచి వుంచుకొన్న వ్యక్తులకడనో వెతికి వేటాడి పట్టుకోవలసి వుంది. ఉదాహరణకి శ్రీకాకుళక్షేత్రం (ఆం.ప) రేవణ (ఆం.ప) కడల్పల్లి (ఆం.ప) బమ్మెర పోతరాజు (దేశమాత 1914) గురించి వారు వ్రాసిన వ్యాసాలింకా లభించవలసి వుంది. అలాటివని శక్తియుక్తులుగల మీలాటి యువకులు చేయవలసి వుంది. ఇక గురజాడ, గిడుగు, వేదం ప్రభృతులు వ్రాసిన లేఖలూ, తాళపత్ర గ్రంథసేకరణార్థం టూరు చేసినప్పటి విషయాలను రాసుకొన్న డైరీలు ఏకారణంచేతనైతేనేం పోయినవి పోగా మిగిలినవే ఇప్పుడు మా వద్ద వున్నవి. కొన్ని లేఖలు ఆయన చించివేయబోతుండగా ఎవరో ఆసక్తిగలవారడిగి తీసికొనివెళ్లిన సన్నివేశాలున్నాయి. చెప్పాపెట్టకుండా ఇంట్లోంచి ఎత్తుకుపోయిన సందర్భాలున్నవి. హరవిలాస పాఠపరిష్కరణ ప్రతి అలా పోయిందనే ఒకసారి ఆయన బాధపడుతుండగా నేనెరుగుదును. మొన్నిమధ్యనే శ్రీ కొత్త వేంకటేశ్వరరావు సంగంజాగర్ల నుండి డెబ్బై ఎనభై లేఖల్ని (1939-

1950 ప్రాంతం) మాకందించారు. ఇంకా ఎన్నెన్నో ఇతరుల దగ్గరున్న వారి రచనల్ని సేకరించాల్సివుంది.

2. మణిమంజరి ప్రధాన లక్ష్యమేమి?

'మణిమంజరి' నిర్వహణ వాఙ్మయరంగంలోనూ, పత్రికాప్రపంచంలోనూ ఒక అపూర్వమైన ప్రయోగ మనవచ్చు. వాఙ్మయ, యోగ పరిశోధనాది విషయాలు కలిగి ఒక వ్యక్తి స్మృతికంకితమై భాషాధ్యయంలో షాణ్మాసికగా వెలువడే పత్రిక ఇదికాక వేరొకటి ఉందనుకోను. వాఙ్మయ యోగ విషయాలను ఏక్సెస్‌గా తీసుకుని ప్రభాకరుల జీవనరేఖను గ్రాఫ్‌గా చిత్రించడానికి చేస్తున్న ప్రయత్నమే మా "మణిమంజరి". 1988లో రానున్న ప్రభాకర శతజయంతి వరకూ ఇది ఇలా కొనసాగుతుంది. అప్పటికి వారి జీవిత చిత్రణము, సంపూర్ణ గ్రంథావళి ముద్రణము సంపన్నమవుతాయి.

3. "సాహిత్య ప్రపంచంలో శాస్త్రిగారొక వివాదాస్పదమైన వ్యక్తి" అన్న డా॥ శేషగిరిరావుగారి మాటతో మీరేకీభవిస్తారా?

వారామాట ఏ దృష్టితో ఎలా అన్నారో నేనింకా తెలుసుకోలేదు. బహుశా ప్రభాకరులు మల్లన గణితాన్ని గురించిరాసినా; వీరశైవ మతాన్ని గురించి రాసినా; రంగనాథుడే రామాయణం రాశాడన్నా; శ్రీనాథుడు శృంగారి అన్నా; క్రీడాభిరామంలో శ్రీనాథుని హస్తం కనిపిస్తోందన్నా; ఆంధ్రశబ్దచింతామణి నన్నయ కృతం కాదన్నా; తిమ్మక్క తొలితెలుగు కవయిత్రిఅన్నా; జోయచ్చుతానంద అన్నమయ జోలే అన్నా; అక్షరలక్షల విలువైన నాగబు శాసనాన్ని శోధించినా; అహదనకర శాసన పాఠాని కర్థం చెప్పి, వింతలిపిరూపాల్ని పసికట్టినా; వాడుకభాష గురించి రాసినా వాటిమీద చర్చలు చాలా జరిగాయన్న దృష్టితోనే వారామాట అన్నారనుకుంటున్నాను. అయితేనేమి? అవేవీ ఆషామాషీగా అన్నవి కావు. అలవోకగా కొట్టివేయదగినవీ కావు. వాదబలిమి లేనప్పుడు వివాదమే ఉండదుకదా ! మౌలికమైనది ఆయన దృష్టి. మరి ఆయన పట్టింది బంగారం కావడంలో ఆశ్చర్యమేముంది?

4. శాస్త్రిగారి జీవితానికి, సాహిత్యానికిగల సమన్వయం ఎట్టిది?

వారి జీవిత క్షేత్రానికి వాఙ్మయ యోగ విషయాలు పొడుగు వెడల్పులు. గురుభక్తి, సంప్రదాయ ప్రయోగాలమీది అనురక్తి, అన్వేషణ ఆ పొలంలో ప్రోదిచేసుకొన్న విత్తనాలు. ఆస్తిక్యబుద్ధి, జీవనకళ్యాణాన్ని గూర్చిన సాధన దానినావరించుకొన్న ఆకాశం. మాస్టరు సి.వి.వి., మహాత్ముడు సూర్యచంద్రులు. కనుక వారి జీవిత సాహిత్యాలకి లక్ష్యమూ, పరమార్థమూ ఒక్కటే.

5. శాస్త్రిగారెన్నో పద్యకృతులు రచించినా కవిగా రావలసినంత పేరు వారికి రాలేదు. ఎందుచేత?

వేదం వెంకటరాయశాస్త్రిగారు తమ వ్యాఖ్యా రచనల్లో "కవి చూడామణి వేటూరి ప్రభాకరశాస్త్రిగారి మూన్నాళ్ల ముచ్చట నుండి" అని కవిత్రయం వారితో సమానంగా ప్రయోగ ప్రామాణ్యాన్నంగీకరించి వానినుదాహరించారంటే చాలదూ సమాధానము? "కవితాపట్టము గట్టుకో దొలుత వేడ్కల్ రేగ నాకుం గృతుల్ దీవురొత్తెన్ వెసమోము మొత్తనిక నాచేజెల్లవీ కల్లబొల్లి వినోదంబు లివే జరామరణముల్ చీడల్ హతంబార్చి పుట్టువు చెట్టున్ నఫలీకరించుకొని యంటుల్ గట్టెదన్ మాలినై" అన్నారు. అదీ వారి ప్రకృతి. సన్మానాలూ, బిరుదులూ వారికి గిట్టేవి కావు అయితేనేమి రసాత్మకాలైన వారి కావ్యాలన్నీ పరిమాణంలో చిన్నవే అయినా మహాకావ్యాలే అనడానికి సహృదయతయే ప్రమాణం. ఆసక్తిగల సాహిత్య విద్యార్థులు శాస్త్రిగారి ఖండ కావ్యాలమీద పరిశోధన చేయడం బాగుంటుంది.

6. ఆధునిక పరిశోధకులకు శాస్త్రిగారు ఏఏ విషయాలలో మార్గ దర్శకులుగా ఉన్నారు?

సత్యాన్వేషణ తత్పరత, చిత్తశుద్ధి, నిరంతరకృషి, బహువిషయ పరిజ్ఞానము, పాండిత్యము, రచనాశక్తి, మౌలికత మీది దృష్టి—ఇవీ శాస్త్రిగారి పరిశోధనల్లో ప్రస్ఫుటంగా గోచరించే విషయాలు. ఈ మర్యాదలకు లోబడిన ఏ పరిశోధన విషయమైనా రాణిస్తుంది.

# నోటుస్లు

భారతి పత్రికల్లో శాస్త్రిగారు వ్రాసిన వ్యాసములను నోట్స్‌రూపమున వివరములు వ్రాసికొన్నారు. భోజుని "శృంగార ప్రకాశం" సంబంధమైన విషయాలు, శాళ్వపాక కవుల రచనలలోని విశేషములు, ఉత్తర హరివంశము —వ్యాఖ్యోపయోగి ప్రయోగములు, స్మృతిరత్నం, మాధవ సాయణులకు సంబంధించిన విషయములు, పరశురామ కల్పసూత్రం, దక్షారామ శాసన వివరాలు, శంకరకృత మృత్యుంజయ మానసికపూజ, నాగార్జున కొండ శాసనములు, ఉపనిషత్తుల నుండి ఆధారములు, రంగనాథ రామాయణ సంబంధమైన అంశములు, వ్రాయవలసిన వ్యాసములు – ఈవిధమైన ముఖ్యాంశము లెన్నియో వ్రాసికొని యున్నారు. ఇట్టి నోట్స్‌లలోని విశేష విషయములో, ప్రయోగ విశేషములో, పరిశోధనాంశములో వాఙ్మయ పరిశీలకులకత్యంతోపకారకములు. పరమ ప్రామాణికులగు శాస్త్రిగారు ఏదో విశేషము లేనిదే వానినట్లు గుర్తించి వ్రాసికొని యుండరు. శాస్త్రిగారు వ్రాసిన ప్రతియక్షరము సేకరించి ప్రకటించవలసి యున్నదని తదజ్ఞులు భావించుటకును, ఆమేరకు శ్రీ ప్రభాకర పరిశోధక మండలివారు కృషిసల్పుటకును హేతువిదియే.

## ప్రభాకరము - నిఘంటు

పూర్వము 'శాసన విశేషములు' అను వ్యాసమునందును, 'తెలుగు-మెఱుగులు' వ్యాససంకలనములోని వ్యాసములందును అపూర్వ పదప్రయోగములనుగూర్చియు, శబ్దరూప నిష్పత్తిని గూర్చియు శాస్త్రిగారు చర్చచేసియున్నారు. శాళ్లపాక వారి కృతులను పరిశీలించునపుడు గుర్తించిన ప్రయోగ విశేషములను 'నోట్సు' రూపమున కొన్ని వ్రాసికొని యున్నారు. ఆసందర్భముననే వారొక నిఘంటు నిర్మాణమునకు తొడగి అకారాది క్రమములో కొన్ని అపూర్వ ప్రయోగము లెత్తిచూపినారు. ఇది ముద్రితరచనము. అవకారి, అంకులు, అక్కలి, ఆద్దలింపు వంటి వపూర్వశబ్దములు.

## వాచకములు

ఫస్టు ఫారము నుండి హయ్యర్ సెకండరీ వరకు శాస్త్రిగారు వ్రాసిన నవోదయ వాచకములు భాషా ప్రణాళికననుసరించి 1952 లో పాఠ్యగ్రంథములుగా పెట్టబడినవి. ఇతరుల రచనలతోపాటు శాస్త్రిగారి పద్యకృతులు, రూపకములు(కొన్ని భాగములు) కూడ అందుచేర్పబడినవి.





